# స్రవంతి

ఫిబ్రవరి,
మార్చి, [redacted] - 1995

వెల: రూ॥ 4.00



దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర
ఖైరతాబాద్, హైదరాబాద్-500 004.

## ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారక మండలి
## వార్షిక సమావేశము ది. 25-1-95



ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారక మండలి వార్షిక సమావేశము సందర్భంగా శ్రీ కడారు మల్లయ్య గారిని సన్మానించుచున్న చిత్రం

[illegible]

## दक्षिण भारत हिन्दी प्रचार सभा, त्यागरायनगर, मद्रास-600 017.

### सभा के प्रचारक व परीक्षार्थी कृपया ध्यान दें।

दक्षिण भारत हिन्दी प्रचार सभा द्वारा सचालित विभिन्न परीक्षाओं के परीक्षा शुल्क में निम्न विवरण के अनुसार परिवर्तन हुआ है। यह परिवर्तन 1995 अगस्त सत्र से अमल में आएगा। सभी चारक बंधु तथा परीक्षार्थियों से निवेदन है कि इस परिवर्तन पर कृपया ध्यान दें।

### परिवर्तित शुल्क का विवरण

| | परीक्षा शुल्क | अंक शुल्क | प्रबंध शुल्क |
|---|---|---|---|
| प्राथमिक | 15–00 | 4–00 | 2–00 |
| मध्यमा | 20–00 | 4–00 | 2–00 |
| राष्ट्रभाषा | 25–00 | 4–00 | 2–00 |
| प्रवेशिका | 45–00 | 5–00 | 5–00 |
| विशारद पूर्वार्द्ध | 45–00 | 5–00 | 5–00 |
| विशारद उत्तरार्द्ध | 45–00 | 5–00 | 5–00 |
| प्रवीण पूर्वार्द्ध | 50–00 | 5–00 | 5–00 |
| प्रवीण उत्तरार्द्ध | 60–00 | 5–00 | 5–00 |
| निष्णात पूर्वार्द्ध | 100–00 | | 10–00 |
| निष्णात उत्तरार्द्ध | 125–00 | | 10–00 |

हर एक परीक्षा आवेदन पत्र के लिए परीक्षा शुल्क, अंक शुल्क व प्रबंध शुल्क के साथ भेजना चाहिए।

### 1995 अगस्त के परीक्षा शुल्क जमा करने की अंतिम तारीख

| | |
|---|---|
| प्रवेशिका व प्रारंभिक परीक्षाओं के आवेदन पत्र सशुल्क स्वीकार करने की अंतिम तारीख | 15–6–1995 |
| प्रारंभिक परीक्षा शुल्क विलंब शुल्क के साथ स्वीकार करने की अंतिम तारीख | 16–6–1995 से 30-6-1995 तक 5-00<br>1–7–1995 से 5-7-1995 तक 10-00 |
| प्रवेशिका परीक्षा शुल्क विलंब शुल्क के साथ स्वीकार करने की अंतिम तारीख | 16-6-1995 से 30-6-1995 तक 10-00<br>1-7-1995 से 5-7-1995 तक 20-00 |

### परीक्षा की तारीख

| | |
|---|---|
| प्रारंभिक परीक्षा (प्राथमिक, मध्यमा, राष्ट्रभाषा) की तारीख | 13-8-1995 |
| प्रवेशिका परीक्षा की तारीख | 12-8-1995 और 13-8-1995 |

प्रान्तीय सचिव

టెలిగ్రామ్ : హిందీసంఘ్

ఫోన్ ; 316863

490

# స్రవంతి

## సాహిత్య మాసపత్రిక

ఫిబ్రవరి, మార్చి–1995

సంపాదకులు

శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ

శ్రీ ఈమని దయానంద

శ్రీ అన్నదానం శంకరశాస్త్రి

దక్షిణ భారత హిందీ ప్రచార సభ–ఆంధ్ర

ఖైరతాబాద్, హైదరాబాద్–500 004

సంవత్సర చందా

40–00

విడిప్రతి

4–00

Recommended for use in all the Public libraries and School Libraries by the Director of public Libraries, Andhra State, Madras, Vide proceedings sl No. 30/55 dated 6th January-1955.

# ఈ సంచికలో

సంపాదకీయం

# మోటూరి సత్యనారాయణ గారు

సుప్రసిద్ధ హిందీ ప్రచార నాయకుడు పద్మ విభూషణ్, శ్రీ మోటూరి సత్యనారాయణగారు మార్చి 6వ తేదీ మద్రాసులో పరమపదించారు వారివయస్సు 93 సంవత్సరాలు. ఒక సామాన్య రైతు కుటుంబంలో జన్మించి, ఆంధ్ర జాతీయ కళాశాలలో విద్యాభ్యాసం చేసి హిందీ ప్రచార క్షేత్రంలో ప్రవేశించి తన మేధా శక్తితో దక్షిణ భారత హిందీ ప్రచార సభ వంటి ప్రముఖ సంస్థకు సారథ్యం వహించి ఎనలేని భాషాసేవ చేశారు మోటూరి వారు గాంధీ మహాత్ము డాశించిన విధానంలో హిందీ భాషకు రూపకల్పన చేయడానికి, జనసామాన్యంలో దానిని ప్రచారం చేయడానికి శ్రీ మోటూరి వారు చేసిన కృషి అనన్య సామాన్యమైనది. ఆయన స్వతంత్రతా సేనాని. దేశం కొరకు త్యాగంచేసి జైలు శిక్ష ననుభవించిన ఉత్తమ వ్యక్తిత్వం వారిది. భారత రాజ్యాంగ నిర్మాణ సభలో సభ్యులుగా వుండి ముఖ్యంగా రాజభాషకు సంబంధించిన అధ్యాయానికి రూపు కల్పించటంలో గాంధీగారి భాషానీతికి ఆ అధ్యాయంలో స్థానం కల్పించడంలో శ్రీ సత్యనారాయణగారు విశేష కృషిచేశారు. దాదాపు ఆరు సంవత్సరాలు రాజ్యసభలో సభ్యులుగా వున్నారు. ఆగ్రా హిందీ సంస్థాన్ వంటి హిందీ సంస్థల్ని నిర్మించారు వాటి అభివృద్ధికి అమోఘమైన సేవలందించారు. వర్ధాలో అఖిల భారత రాష్ట్రభాషా ప్రచారసమితికి మహాత్ముని ఆదేశం ప్రకారం సహాయంచేసి అఖిల భారత రాష్ట్ర స్థాయిలో దానికి స్థానం కల్పించారు. కేవలం హిందీ ప్రచారంతోనే సంతృప్తి చెందక ఆనాటి మద్రాసు ప్రభుత్వం వారి సహాయంతో తెలుగు భాషా సమితిని స్థాపించి విషయ ప్రధానంగా

విజ్ఞాన సర్వస్వానికి రూప కల్పనచేసి దాదాపు 16 భాగాలను ప్రచురింపజేశారు ఆ రూపంలో తెలుగుకు వారు చేసిన కృషి ప్రశంసనీయమైనది. అనేక వ్యాసాలు హిందీ, తెలుగు, ఇంగ్లీషులలో వ్రాశారు. అనువాదాలు చేశారు. నాగార్జునసాగర్ నిర్మాణానికి గూడా వారు చేసిన కృషి శ్లాఘనీయమైనది. ఏ పని ప్రారంభించినా అకుంఠిత దీక్షతో కష్టపడి ఆ పనిని సాధించడంలో దిట్ట శ్రీ మోటూరి వారు. వారి మరణంతో హిందీ ప్రచార క్షేత్రంలో ఎంతో లోటు ఏర్పడింది. ఆ లోటును పూడ్చడం అంత తేలికైన పనిగాదు. వారి ఆత్మకు శాంతిని ప్రసాదించమని భగవంతుని వేడుకొంటూ స్రవంతి వారికి తన శ్రద్ధాంజలిని సమర్పిస్తున్నది.

# సాహిత్యవీధి

## పినవీరన జైమినీ భారత ప్రాశస్త్యం-2

— కె. మార్కండేయులు

ఇక చతుర్థాశ్వాసమున కథ నీలధ్వజ మహారాజు సవనాశ్వమును బట్టుటతో ప్రారంభమగును. నీలధ్వజుని కొడుకు ప్రవీరుడను వాడు తన భార్య కోరికపై సవనాశ్వమును బట్టుట, వృషకేతుడు, అను సాళ్వుడు వారితో యుద్ధము చేయుట, ప్రవీరుడు శత్రుసేనల నెదిరించలేని స్థితిలో తండ్రి నీలధ్వజుని దేతెంచి యుద్ధము చేయుట నీలధ్వజు నియల్లుడు అగ్నిదేవుడు అర్జునుని సైన్యమును కాల్చుట నీలధ్వజునకు అగ్నిదేవు డల్లుడైన విధము. అగ్నిదేవుడు మధ్యవర్తిగా నీలధ్వజుని వారించి సవనాశ్వమును అర్జునున కిప్పించుటకు ప్రయత్నించుట, నీలధ్వజుడు దానికి సమ్మతింపబోవ నతని భార్య అందుకు సమ్మతింపకపోవుట. నీలధ్వజార్జునుల ద్వంద్వ యుద్ధము, నీలధ్వజుని సైన్యము యుద్ధమున మడియుట. అర్జునునకు కానుకంతో నీలధ్వజుడు సవనాశ్వమును సమర్పించగ, దానిని అవమానకరముగా భావించి అతని భార్య కాశికిపోయి తనతమ్మునికి జరిగిన వృత్తాంతము చెప్పగా అతడు దుఃఖాశ్వము తన పీటికి నేడోరేపో రావచ్చునని దానినిబట్టి అర్జునునితో యుద్ధము చేయగలనని ఒకవేళ అలా రాకున్నను ఏదో ఒకనాడు అర్జునుని పొగరడంతునని పల్కగా ఆమె దానికి సమ్మతింపక ఇప్పుడే అర్జునునితో యుద్ధము చేయమనుట. మెట్టినింటిని చెఱిచి పుట్టినింటినికూడ చెఱుపుటకు వచ్చితిని అని అవమానింపగా ఆమె గంగాసమీపమునకుపోయి భీష్ముని అర్జునుడు చంపుటచే నీవు అసవత్యురాల వైతివి, నిన్నంటిన మహాపాపము కల్గునని అర్జునునిపై గంగకు కోపము కల్గునట్లు ప్రేరేపించుట, గంగ అర్జునుని శిరము అరునెలలలోగా అవని ద్రెళ్ళునని శాపమిచ్చుట—ఈ నీలధ్వజుని చరిత్రకు సంబంధించిన కథ. నీలధ్వజుని కథ గంగాశాప వృత్తాంతమునకు కారణమైనది.

సవనాశ్వము వింధ్యాద్రి సమీపమునకుపోయి అక్కడొకరాయిని గదిసి అంటుకొనిపోగా వెరగందిన అర్జునుడు సమీపమునకున్న సౌబరియాశ్రమమునకు చేరి సవనాశ్వము రాయికి అంటుకొని పోవుటకు కారణమేమి అనియడుగగా సౌబరిముని ఉద్దాలకముని చరిత్రమును తెలియజేయును.

తెలుగు పండిట్, ఎమ్. ఆర్. హైస్కూల్. విజయనగరం–531202. ఆం.ప్ర.

ఈ ఉద్దాలకుని చరిత్ర జైమినీ భారతమునకు వన్నెతెచ్చిన ఉపాఖ్యానములలో ప్రముఖమైనది.

ఉద్దాలకుడను ముని భార్య పేరు చండిక. ఆమె దుశ్శీల. అతి పరుషవచన. చెప్పినపనికి వ్యతిరేకముగా చేయుట ఆమె సహజ లక్షణము. ముని పాట్లు క్రిందిపద్యంలో కవి వర్ణించిన తీరు పాఠకులకు ఆ మునిపట్ల సానుభూతిని కల్గజేయును.

''సంధ్యావార్వగనిమ్ము జలపాత్రమనబోవ,
గొట్టిన నతికించుకొనగవలసె
తడిదోవతిమ్మన్న నడిపికి మడి జింప, గట్టుకో
బడె బ్రహ్మకమ్మిపైచి
అక్షమాలిక జూపు మన ద్రెంచిపైచిన, బనిచె
మరి గ్రుచ్చికొనగవలసె
సమిధలిమ్మన్న ప్రేలిమిగుండ మార్చిన
నూడుకోబడె మండనొకవిధమున
అనుదినము నిట్లు ప్రాతికూల్యము భజింప,
జండిక తమునముని బ్రహ్మచర్యనియమ
మునకు, గృహమేథివర్తనమునకు దొంగి
రెంటికిని జెడ్డరేవని రీతియయ్యె''

ఇలా ఉండగా ఒకనాడు కౌండిణ్యముని శిష్యులతో గూడి ఉద్దాలకుని ఇంటికి ఆతిథ్యమునకు రాగా ఉద్దాలకుడు తన సతిసంగతిని తెలియజేసెను. అపుడా ముని అతనితో—

''ఆయినపనికింతనేమి సేయంగవచ్చు, నగ్ని
సాక్షిగ నుద్వాహమైనవెనుక
విడువవచ్చునె సతులెంత వేఱులైన, దీనికొక
యుక్తి చెప్పెద తెలుసుకొనుము
చేయవలసిన కార్యము చేయకుమను, మఱియు
గడగిచేయు నిజముగా
చేయని కార్యమవశ్యము చేయుమనుము బాలు
నదియు జేయకమానున్''

అని సలహా చెప్పినాడు

వెంటనే ఉద్దాలకుడు ''పితృకర్మను చేసినచో విధవానందనులకు, బధిరులకు, అవైష్ణవులకు, అన్యధనాపహారులని చెప్పనునేకాని ఇతరులను చెప్పను. పితృకర్మకుపయోగింపదగని ఉలవలు, చణకంబులు, చేమలు, కందులు మొదలగు ధాన్యములను ఉల్లి, ముల్లంగి, పుచ్చకాయ, సొరకాయ, వంకాయవంటి కూరలను తెత్తునేగాని మంచి కూరలను తేను, కుతపకాలమునగాక అపరాహ్ణంబున నిర్వహించి శ్రాద్ధంబశ్రాద్ధంబుగ జేతును' అని పలుకగా చండిమొండిపడి యథాశాస్త్రంబుగ ఉద్ధాలకునిచే శ్రాద్ధకర్మను నిర్వర్తింపజేసినది. ఆ సంతోషములో చేయవలసిన పనికి వ్యతిరేకముగా చెప్పుట మరచి 'పార్వణమును పావన గంగాజలములో కలుపుమని చెప్పగా వెంటనే చండి దానిని పెంటమీద వైచినది. ఉద్దాలకుడందులకాగ్రహించి 'శిర్వాగ్యరాలా పవిత్రమగు పార్వణమును పెంటపై వైచి శ్రాద్ధకర్మను కుంటుబడజేసితివి. కావున వింధ్యాద్రుల యొద్ద వనమున పాషాణముగ బడియుండుమని' శపించెను

శాపభయముచే గడగడలాడుచున్న సతిని ఉద్దాలకుడు కరుణించి ధర్మనందనుని యాగాశ్వము శిలారూపిణిగనున్న నిన్నొరసి కొని అంటియుండును. ఆ యాగాశ్వమును విడిపించుటకు వచ్చెడి అర్జునుని చేయి తగులగానే శాపవిముక్తురాలవు కాగలవని యనుగ్రహించినాడు

ఈ కథను సౌబరిముని అర్జునునకు తెల్పి ఆ రాతినితాకి నీ గుఱ్ఱమును విడిపించుకొనుటయే కాక చండికకు శాపవిమోచనమును గూడగావింపుమని చెప్పగా 'రాముని అంఘ్రిరేణువు సోకి రాయి

అహల్య అయినట్లుగ 'అర్జునుని కర స్పర్శకు చండిక శాపమోక్షము పొందినది ఉద్దాలకుడు మాత్రము గార్హస్థ్యమును స్వీకరింపక సన్యాసి అయినాడు

పవనాశ్వము వింధ్యాద్రి దాటి చంపకాపురము ప్రవేశించి హంసధ్వజ మహారాజు చేత చిక్కుట, హంసధ్వజునితో యుద్ధము నాల్గవ ఆశ్వాసములో తరువాత చెప్పబడినవి. హంసధ్వజుడు విష్ణు భక్తుడు. అతని కుమారుడు యుద్ధమునకు వచ్చుటకు అలస్యము చేసినందున అతనికి శిక్షగా తండ్రి తప్తతైలకటాహమున పడవేయించినను విష్ణుభక్తి పరాయణత్వము వలన అతడు బ్రతుకును. ఇంతటితో నాల్గవ ఆశ్వాసము పూర్తియగును.

ఐదవ ఆశ్వాసము హంసధ్వజుని కుమారుడు సుధన్వుడు వృషకేతునితో యుద్ధము చేయుటతో కథ ఆరంభమగును. అర్జునుడు సుధన్వునితో యుద్ధము చేయుట, అర్జునుడు సుధన్వునితో యుద్ధము చేయలేక కృష్ణుని తలచుకొనగా కృష్ణుడు ప్రత్యక్షమై అర్జునునకు సహాయ మొనర్చుట. అర్జునుడు మూడు శరములుపయోగించి సుధన్వుని చంపుట. ఆ వెనుక నీలధ్వజుని కుమారుడు సురధుండను మరొకండు అర్జునునితో యుద్ధము చేయుట, యుద్ధములో చనిపోయిన సురధుని శిరము కృష్ణుని పాదములపై పడగా కృష్ణుడు గరుత్మంతుని పిలిచి ఆ శిరమును ప్రయాగలో త్రివేణి సంగమమున వేయుమని చెప్పుట, శివుని ఆజ్ఞపై శైలాదియను ప్రమధుడు గరుత్మంతుని వెన్నంటి ప్రయాగలో వేయబోయిన సురధుని శిరమును తేగా శివుడు దానిని తన మెడలో హారముగా ధరించుట, తన కుమారులిరువురు యుద్ధమున మడిసిన పిదప హంసధ్వజుడు యుద్ధమునకు వచ్చి కృష్ణుని మాటల కంగీకరించి అర్జునునితో స్నేహము చేయుట అను అంశములు హంసధ్వజుని కథకు సంబంధించినవి.

ఆ పిదప యజ్ఞాశ్వము దక్షిణదిశగాపోవుచు ఒక్కవనమున సరస్సులో దిగగా మగగుఱ్ఱము గాను కొంతసేపటికి వ్యాఘ్రముగాను మారును కృష్ణుని అర్జునుడు తలచుకొన్నంతనే మరల యజ్ఞాశ్వము మామూలు రూపుపొందును.

ఆ పిదప యజ్ఞాశ్వము యువతి మండలమైన ప్రమీల రాజ్యమందు ప్రవేశించును. ప్రమీల సఖులా అశ్వమును పట్టి ప్రమీలకీయగా అర్జునుడు ప్రమీలతో యుద్ధముచేయ యత్నించును. కాని ప్రమీల అర్జునునితో—''సోమ ప్రాసంబుని యగ్రగణుండొనర్చి, ఇష్టవ భోగములం బొందనిమ్ము నీవుపిట మదీయా ధరామృతం బెలమిగ్రోలి యువతి మండలమున కెల్ల నాధయుండగుము'' అనగా అర్జునుడంగీకరింపక యుద్ధముచేయగా ఆకాశవాణి ''ప్రమీలను జయించుట కష్టము. ఆమెను వరించి యజ్ఞాశ్వమును ముందుకు కదలింపుమనగా అర్జునుడట్లేచేయును.

ఆ పిదప యజ్ఞాశ్వము వృక్ష దేశమునకు రాగా బకాసురుని కొడుకు భీషణుడనువాడు యజ్ఞాశ్వమును బంధించగా అర్జునుడతనితో యుద్ధము చేసి అతనిని చంపును.

తరువాత యజ్ఞాశ్వము మణిపుర ప్రభువు బభ్రువాహనుని రాజ్యమునకు చేరును. బభ్రువాహనుడు చిత్రాంగదకు అర్జునుని వలన జన్మించినవాడు. బభ్రువాహనుని సేనాని సుబుద్ధి యజ్ఞాశ్వమును బట్టి రాజునకు సమర్పించగా బభ్రువాహనుడు పవనాశ్వము నిటలమున వ్రాసి ఉన్న విషయమును చదివి అది తన పెదతండ్రి చేయు అశ్వమేధమునకు సంబంధించిన అశ్వమని తెలిసికొని అతడు అశ్వమును సమర్పింపబోగా

అర్జునుడు తిరస్కరించి బభ్రువాహనుడు కోపించి అర్జునునితో యుద్ధమునకు తలపడును.

ఈ సందర్భమున రామునకు కుశలవులతో జరిగిన యుద్ధమును జైమిని ప్రస్తావించగా జనమేజయుడు ఆ వృత్తాంత మడుగుటతో పంచమాశ్వాసము పూర్తియగును.

షష్ఠాశ్వాసము శ్రీరాముడు రావణవధానంతరము అయోధ్యలో పట్టాభిషిక్తుడై రాజ్యపాలనము చేయుటతో ప్రారంభమై కుశలవులతో యుద్ధము, శ్రీరాముడు మూర్ఛితుడైన పిదప సీతావాల్మీకుల వలన తండ్రికొడుకులు కలిసి అయోధ్యాపురమునకు పోవుటవరకు సాగినది.

సప్తమాశ్వాసమున బభ్రువాహనుని చేతిలో అర్జునుని మరణము, అర్జునుని శిరస్సు తెగిపడుట, మృతసంజీవనీ రత్నముతో అర్జునుని పునర్జీవితుని చేయుటకు యత్నించుట నాగకుమారులు సంజీవనీమణి నిచ్చుటకు తిరస్కరింపగా బభ్రువాహనుడు సంజీవనీమణికొరకై ఉరగుల నోడించి దానిని తెచ్చులోగా నాగకుమారులు అర్జునుని శిరము నపహరించి మాయము చేయుట, శ్రీకృష్ణుని మహిమ వలన తిరిగి అర్జుననితోపాటు యుద్ధమందు మరణించిన వృషకేతుడు కూడ జీవించుట, గంగాశాపమువలననిట్లు జరిగినదని కృష్ణుడు చెప్పుట అనునవి బభ్రువాహనుని కథలోని విషయములు.

మణిపురరాజ్యము నుండి సవనాశ్వము మయూరధ్వజుని రత్నపురమునకు చేరును. మయూరధ్వజుని సవనాశ్వము అతని కుమారుడు తామ్రధ్వజుని రక్షలో తిరుగుచుండగా రెండు యజ్ఞాశ్వములు ఎదురగును. తామ్రధ్వజుడు పాండవాశ్వమును పట్టగా అతనితో కృష్ణార్జునులు యుద్ధము చేయుదురు. తామ్రధ్వజుండు కృష్ణార్జునులను జయించి హయమును గొనిపోగా కృష్ణార్జునులు మాయావిరూపములతో మణిపురము ప్రవేశింతురు. అపురమున రాజుతోబాటు అందరును విష్ణుభక్తులే.

మాయాబ్రాహ్మణులు మయూరధ్వజుని వద్దకేగి ఈవిధముగాకోరుదురు. అందు కృష్ణుడు కృష్ణశర్మాభిమానుడగు బ్రాహ్మణునిగ తనను తాను పరిచయము చేసుకొని అర్జునుని తన కుమారుని పెండ్లికి పురోహితునిగ పరిచయము చేయును. తన కుమారుని పెండ్లికి కన్నియకై వచ్చుచుండగా సింహమొకటి తమ కుమారుని పట్టి మయూరధ్వజుని అర్ధదేహమిచ్చిన కుమారుని చంపక వదులుదునని చెప్పగా నీకొరకై వచ్చితిమని చెప్పిరి. మయూరధ్వజుని భార్య, కుమారుడు ఇరువురును తమ ప్రాణము లిచ్చుటకు సిద్ధముకాగా సింగము నృపుని వామాంగము స్త్రీభాగముకాన అదివద్దన్నదనియు, రాజదేహమును అతని భార్యయు పుత్రుడును కోయవలెనన్నదనియు చెప్పెను. అప్పుడు భార్యాపుత్రులిరువురు మయూరధ్వజుని కోయసిద్ధపడిరి. వెంటనే కృష్ణార్జునులు తమతమ రూపములతో ప్రత్యక్షమైరి. అర్జునుడు మయూరధ్వజునితో సఖ్యముచేసి సవనాశ్వమును విడిపించుకొనుటతో సప్తమాశ్వము పూర్తి అగును.

అష్టమాశ్వాసకథ వీరవర్మ పాండవ హయమును పట్టుటతో మొదలగును. ఆవీరవర్మను జయించి సవనాశ్వమును విడిపింపగా నది చంద్రహాసుని రాజ్యమైన కుంతల రాజ్యమును చేరును. కుంతల రాజ్యము చేరిన సవనాశ్వము తన్నదక

పోవుటచే ఆశ్చర్యపడుచున్న అర్జునాదులకు నారదుడు హయము కుంతలాధీశుడైన చంద్రహాసుని కథ వినిపించును.

కేరళాధీశ్వరునకు ఒక కొడుకు మూలా నక్షత్రమునందుదయించినాడు. గండదోషమున జనకుడు చనిపోగా జననియు చితి చిచ్చురికినది. అపుడు దాదులు ఆబాలకుని కుంతలపురమునకు గొనివచ్చి 5సం॥లు పెంచిరి. కుంతల దేశపు మంత్రి దుష్టబుద్ధి ఋష్యులవలన ఆబాలుడు అఖిలక్ష్మామండల మేలగల మేటిరేఖగలవాడని తెలిసికొని వానిని చంప వలసినదిగా కింకరుల నాజ్ఞాపించెను. వారు ఆబాలుని చంపనొల్లక అతని కడకాలి వ్రేలుకోసి మంత్రికి చూపిరి. సౌటరదేశ ప్రభువగు కుళిందకునకు సంతానము లేదు విష్ణుభక్తుడగు కుళిందకునకు వేటసమయమున హరిని స్మరించుచు బాధపడుచున్న ఆబాలకుడు కనిపించగా నతడాబాలుని పుత్రునిగ స్వీకరించి పెంచుచుండెను. దినదిన ప్రవర్ధమానుడై చంద్రహాసుడు పరాక్రమోపేతుడై రాజ్యము చేయ సాగినాడు. కుళిందకునిద్వారా చంద్రహాసునిగూర్చి విన్న దుష్టబుద్ధి తాను చంపయత్నించిన బాలుడు బ్రతికియున్నందుకు వగచి మరొక మారతనిని చంపుటకు యత్నించినాడు. చంద్రహాసుని కుంతల పురమునకు ఒక లేఖ నిచ్చిపంపినాడు. ఆ లేఖలో 'ఈతడహితుడు గాన సందేహము మాని విషము నిమ్మ'ని వ్రాసినాడు. ఆ లేఖతో తన కుమారుని కలుసుకొమ్మని పంపినాడు.

దుష్టబుద్ధికి నొక కూతురు కలదు. ఆమె పేరు విషయ. దుష్టబుద్ధి కుమారుడు విశ్రమించినాడు నిద్రావస్థలోనున్న చంద్రహాసుని, అతని వద్దనున్న లేఖను చూచి తన తండ్రి కుయుక్తికి పరితపించి ఆ లేఖలోని 'విషము' అనుదానికి బదులు 'విషయ' అని మార్చి అట నుండి వెడలిపోయెను చంద్రహాసుడిచ్చిన లేఖ ప్రకారము విషయ నిచ్చి మదనుడు చంద్రహాసునకు పెండ్లి చేసెను. దుష్టబుద్ధి యది గ్రహించి ఏ విధముగనైన వానిని చంపనిశ్చయించుకొని కింకరులను కాళికాలయములో దాగుండి అపర సంధ్యాకాలమున ఒంటరిగా వచ్చిన వానిని వెనుక ముందు చూడక చంపుమని అజ్ఞాపించెను. పిదప దుష్టబుద్ధి చంద్రహాసుని పిలిచి పెండ్లి అనంతరము కాళికాదేవిని ఒంటరిగా సేవింపవలెను కావున నేడపర సంధ్యా సమయమున దేవి ఆలయమునకు పొమ్మని చెప్పెనాడు.

ఇంతలో కుంతలదేశ ప్రభువు తన అవసాన కాలము సమీపించినదని ఈలోగా తమ కుమార్తెను చంద్రహాసునకిచ్చి పెండ్లి చేయవలెను వెంటనే చంద్రహాసుని కొనిరమ్మని మదనుని పంపగా, మదనుడు కాళికాదేవిని సేవింపబోవు చంద్రహాసుని రాజు నొద్దకు పంపి అతనికి బదులుగా తాను కాళికాదేవిని సేవింపబోయెను. దుష్టబుద్ధి చెప్పిన ప్రకారము కింకరులు మదనుని సంహరించిరి. జరిగిన దానికి దుష్టబుద్ధి వగచి 'విష్ణుభక్తులకు చెండు దలంచు ద్రోహులకు యక్తుల్ గొల్చునే' 'అనుకొనుచు తన శిరమును బలిపీఠమున బాదుకొని ఆత్మహత్య గావించుకొనినాడు చంద్రహాసుడది గ్రహించి కాళికాలయమున కేగి హోమకుండము త్రవ్వించి అగ్నిరగిల్చి 'నేడు వీరిని బ్రతికింపకున్నచో ప్రజలు తన్ను నిందింతురని తలచి తన శరీరముమీది కండలు తరిగి తుదకు తన శిరస్సును కూడా పూర్ణాహుతి గావించుటకు ఉద్యమెత్తగా నప్పుడుదేవి ప్రత్యక్షమై వరము కోరుకొమ్మనగా చనిపోయిన వారందరినీ బ్రతికింపుమని నారాయణుని మీద తనకు భక్తి ఉండ నిమ్మని కోరినాడు. దేవి అతని కోరిక దీర్చి 'బలసమన్వితులగు కుమారులు నీకు కలుగుదురు' అని

దీవించెను. చంద్రహాసుడు విష్ణుభక్తుడై 300 ఏండ్లు భూమిని పాలించినాడు. ఈ చంద్రహాసుని మీరుయుద్ధములో జయించుట కష్టమని పలికి అతనితో సఖ్యము చేసికొనుమ'ని నారదుడు పల్కెను.

కృష్ణార్జునులు చంద్రహాసునిదర్శింపబోవ నాతడే యెదురొచ్చి కృష్ణునకు సాష్టాంగ ప్రణామము చేసినాడు. కృష్ణుడు చంద్రహాసుని కౌగలించుకొని ఇతడు నా భక్తుడు. ఈతనితో సఖ్యము చేయుమని పల్కి అర్జునుడు చంద్రహాసుని కౌగలించుకొనగా చంద్రహాసుడును అర్జునుని గౌరవించి సవనాశ్వము నప్పగించినాడు.

సవనాశ్వమును గొని ఎల్లరు హస్తినాపురమునకు చేరగా ధర్మజు డశ్వమేధంబు సమాపనము గావించుటతో కథ ఎనిమిదాశ్వాసములతో ముగిసెను. గ్రంథాంతమున శ్రీకృష్ణుడు "భూలోకమున కలిమహిమవలన వర్ణాశ్రమ ధర్మములు పెరుగు వడ్లవలె కలిసిపోవుననియు నానాసమయమున చంద్రవంశమున కుటిలులను శాసించి ధర్మపాలన చేయుటకై సాళువ నరసింహ భూపతిగ జన్మింతుననియు ధర్మరాజుతో చెప్పినట్లు గలదు.

కవి కృతికర్తను గ్రంథాదిని అర్జునునిగాను గ్రంథాంతమున శ్రీకృష్ణునిగాను పోల్చి తన కృతజ్ఞతను వెల్లడించుకొనినాడు.

## పినవీరన కవితాశైలి :

పినవీరన కవిత్వమెట్టిదను విషయము కృతికర్తముఖమున చెప్పిన ఈపద్యమును బట్టి తెలియును.

"అల్లనవిచ్చు చెంగలువడందు రజంబును కప్పురంబుపై
జల్లగజల్లనై వలచు సౌరభముల్ వెదజల్లు భావముల్
పల్లవహస్త చన్నుగవ సయ్యెద జీబుగ దోచుభాతిగా
బిల్లలమఱ్ఱి పీరన యభిజ్ఞుడు చెప్పగ నేర్చు గబ్బముల్"

ఇతని కవిత్వములో నుడికారము—తెలుగు సంస్కృతసూక్తి పై పోటీపడి పరుగులెత్తినది. తెలుగునుడికారమునకు కొన్ని ఉదాహరణలు:— 1 కూకటివేళ్ళతో పెరికి, 2 గోరుచుట్టుపై రోకటిపోటు, 3 విత్తము లెక్కసముగ మూల్గుట 4, మరచి కూర్చుండి శిలదెప్పగాయ్యజేసి జలధిలో లాగంగకలచినట్లు, 5 చింతామణి విడిచిగవ్వజేకొను భంగిన్, 6 ముంగొంగుబసిడి, 7 రదనము లూడ దన్నుట, 7 పంచబంగాళమైపోవుట, 8 వేయిచెప్పి నను, 9 రెంటికి చెడ్డరేవనిరీతి, 10 చిచ్చెగసిన వెనుక వశమెచేటనుగ్రమ్మన్, 11 పద్మగర్భాదులకు ఈతబంటియనిన చెక్కుమీటిన పసవల్చు శిశువులెదురె మొదలైనవి.

## సంస్కృత సూక్తి వైచిత్రికి ఉదా:

1 అభ్యాగతః స్వయం విష్ణుః, 2 అటవ్యాంనారసింహః 3 దుర్బలస్యబలంరాజా 4 అగ్నిముఖా వైదేవాః, స్త్రీబుద్ధిః ప్రళయాంతకః మొదలైనవి

## అలంకారిక శైలి:

పినవీరన తనగ్రంథమంతట ఉపమాలంకారములను విరివిగా వాడినాడు. "ఇమ్మతిసారె గుడి దిరుగు

కొనెడు విధమున'', ''సురగాలిం బడిన చొప్ప దొరగును బోలెన్'', ''అయస్కాంతము మినుము చెందిన మాడ్కిన్, మొదలైన ఉపమలెన్నోగలవు. ఇదే విధముగ రూపకములు అర్థాంతరన్యాసములు ఉత్ప్రేక్షలు శ్లేషలు కానవచ్చును.

క్రింది ముక్తపద గ్రస్తము పినవీరన సంస్కృత సమాసభూయిష్ట రచనకు మచ్చుతునక.

ప్రమదాస్వాంత నికాంత, కాంతనవశౌర్య
ప్రోడి మాభోగ, భో
గమరు ద్రాజసమాన, మానకలనా కౌరవ్య.
కవ్యగ్రజ
న్మమనోజ్ఞ స్మృతిమార్గ, మార్గణ కుటుంబ
స్థైర్య సంకల్పక
ల్పమహీజ ప్రతి మాన దానసుషమా భాస్వత్
కరాంభోరుహా

## వర్ణనలు

ఇతివృత్తమునకు సరిపడు వర్ణనలను పినవీరన సముచితముగా సంధించినాడు. సూర్యోదయ, సూర్యాస్తమయ, పుత్రోదయ, తటాకాది వర్ణనలను చేసినాడు. సూర్యాస్తమయ వర్ణనకు చిన్న ఉదాహరణ

అంతట గనుపట్టెను భా, న్వంతుడు చరమా
ద్రిమీద వారుణ దిక్సీ
మంతిని జల కేళికిఁజిలు, బంతి పసుపు
ముద్ద సన్నెపై నిడుభంగిన్.

ఇక యుద్ధవర్ణనలు లెక్కకు మిక్కిలిగా చక్కగా వర్ణించినాడు. పద్మవ్యూహము గృధ్ర వ్యూహమువంటి యుద్ధరీతులను వర్ణించినాడు. యుద్ధములను ప్రత్యేకశ్రద్ధతో వర్ణించిన తెలుగు కవులలో నన్నెచోడుడు, తిక్కన, నాచన సోము లతో పాటు పినవీరన కూడ ఎన్నదగిన వాడు.

## ఛందో వైచిత్రి:

తిక్కన వలె పినవీరనయు కందపద్యము లను ఎక్కువగా వాడినాడు. కందపద్యమును చక్కగా నెక్కువగా వాడినవాడే దమ్మన్నకవియని లోకప్రతీతికదా, మిగిలిన వాటితోపాటు పృథ్వీ వృత్తములను కూడ ఈయన వాడినాడు.

## వ్యాకరణ విరుద్ధ ప్రయోగములు:

ఈ కవి ప్రయోగములందు కొన్ని వ్యాకరణ విరుద్ధ ప్రయోగములు కలవు. వాటిలో క్వార్థే కార సంధులు ప్రధానమైనవి ఎరిగిట్లుకోయు; బనరించె దురేగు' మొదలైనవివీటికి ఉదాహరణలు. యడాగ మము చేయక ప్రయోగించుటకు ఉదా 'వీరమాతట' 'తనదారని,' మొదలైనవి, కువర్ణకమునకు నగా మముచేయక ప్రయోగించుట 'రాజుకున్' ఇత్యాదులు వ్యాకరణ విరుద్ధ ప్రయోగములుగా చూపించ వచ్చును '' నిరంకుశాః కవయః" అని కదా ఆర్యోక్తి.

## అనౌచిత్య సంభాషణలు:

భీమ శ్రీకృష్ణులమధ్య, రుక్మిణి కృష్ణుల నడుమ జరిగిన కొన్ని అనౌచిత్యకరమైన సంభాషణం వ్యాసుడు ధర్మజునకు బోధించిన జారస్త్రీ లక్షణములు పాఠకులకు కొంత జుగుప్స కల్గించునని విమర్శకుల తలంపు మూలమున నున్న వాటిని యథాతథముగా అనువదించుట వలన అట్టి కళంకము కొంత పరకున్నను అది చంద్రునిలోని మచ్చవంటిదే

మూలమున ప్రమీల అర్జునునితో ''కింత రివ్యసి యాగేన మయాసహ మధుం పిబ ''అనగా పిన వీరన దానిని'' సోమపానంబు నీయగ్రజుండొనర్చి ఇష్టఫల భోగముల పొందనిమ్ము, నీవునిట

మదీయధరామృతంబు గ్రోలి, యువతి మండలమునకు కెల్లనొడయ వగుము "అనుకీతిలో వ్యాఖ్యానించినాడు.

పినవీరన శ్రీనాథుని మార్గము ననుసరించి జైమినీ భారతమును తెనిగించినాడు. పిత్రార్జితమగునాస్తిని పెంపొందించి తన తరువాతి తరమువారి కందిం నట్లుగ పినవీరన తన తరువాత ప్రబంధకవులకు మార్గదర్శకుడు కూడ అయినాడు.

నన్నపార్యుని ప్రబంధ ప్రౌఢవాసనా సంపత్తి నాచనసోముని వాచా మహత్త్వము, శ్రీనాథభట్టు భాషానిగుంభనము పినవీరన రచనలో కనబడును.

రాజవాజభూషణాది ప్రబంధకవులు పినవీరన ననుసరించిరన్నచో ఇతని కవిత్వమునకు మరొక గీటురాయి అవసరములేదు. సముఖము వెంకట కృష్ణప్ప జైమిని భారతమును వచనముగా రచించి ఇతనిని పూర్తిగ ననుసరించినాడు. అన్యభాషా కవులెందరో పినవీరన జైమినీ భారతమును తెలుగు లోనికి అనువదించిన తరువాత వారివారి భాషలలో జైమినీ భారతమును వెలయించిరి.

## కృష్ణభక్తి ప్రాధాన్యము

గ్రంథమందంతట కృష్ణభక్తి ప్రాధాన్యము కనబడును. ఉదాహరణకు కర్ణసుతుడు తనతండ్రి కృష్ణునాశ్రయింపక దుర్యోధను నాశ్రయించినాడని చెప్పు సందర్భములో

'అంతరముదప్పి లక్ష్మీకాంతుని కృష్ణుని
భజింపక దయారహిత
స్వాంతు సుయోధను గొలిచెన్. చింతామణి
విడచి గవ్వకేకొనుభంగిన్.

ఇట్టివే "వాసుదేవుని కృపగలవారి కెందునరయ దుర్ఘటమైన కార్యము గలదె", "భక్తజనులకు ముంగొంగు పసిడిగాదె, దేవతారత్న మీవాసుదేవు డెందునేయుపద్రవము జెందు నందులకు వచ్చి రక్షించునచ్యుతుండు" వంటివి. వీలైన చోటెల్లకవి శ్రీకృష్ణుని మాహాత్మ్యమును కీర్తించినాడు.

పైవిధముగా శ్రీకృష్ణమహాత్మ్యప్రతిపాదకమై తెలుగు నుడికారపు సొంపుతో, అరుదైన వీరగాథా కావ్యములలో మేలుబంతిగా పినవీరన జైమినీ భారతము ఆంధ్రవాఙ్మయమందు ఎంతో ప్రాశస్త్యము పొందినదనుట సత్యదూరము కాదని చెప్పవచ్చును.

# సోమసుందర్ గారి ఆంగ్లసీమలో ఆమని వీణలు

—డా॥ శివలెంక ప్రకాశరావు

ఏ కవిత్వ వస్తువుకైనా ఏదో ఒక ప్రేరణ మూలధాతువుగా ఉంటుంది. కవితను చూచిన విషయాలనో లేక ఎవరో చూచి చెప్పిన విషయాలనో ఆధారం చేసుకొని తాను పొందిన అనుభూతిని మననం చేసుకొని కవితీకరిస్తాడు. కవి స్వయంగా దర్శించిన వస్తువును ప్రదర్శించినా కవి, దానికి తగిన మూసను ఎంపిక చేసుకొని, సందర్భాను సారంగా భావచిత్రాలనూ, పద చిత్రాలను శిల్పీకరించి వర్ణించిన దానికొక జిగినీ,బిగినీ కలిగిస్తాడు. అది చదివినప్పుడు పాఠకుడికి తాను పొందిన అనుభూతి మరల కలిగేటట్లు చేసాడుకవి.

ఆధునిక కవిత్వంలో ముఖ్యమైన ఎన్నో ధోరణులు ప్రచారంలో ఉన్నాయి. అయితే కవులు తమ యాత్రానుభవాలను కవితారూపంగా ప్రదర్శించినట్లు కనబడదు. ఆ విధమైన ప్రయోగాన్ని ప్రప్రథమంగా అని వచన కవిత్వంలో ప్రముఖ అభ్యుదయకవి డా. ఆవంత్స సోమసుందర్ గారు చేసి చూపించారు. 1983 ఆగష్టునుండి నవంబరు వరకూ అరుద్రగారితో కలిసి ఆయన ఆంగ్లసీమలో పర్యటించి, దర్శించిన స్థలవిశేషాలనూ, పొందిన అనుభవాలనూ కవితారూపంలో మనోహరంగా మనకు అందించారు ఆవంత్సవారు; దీనిని 1986 లో వెలువరించి మరో కీర్తిపతాకను ఎగురవేశారు ఆయన

ఒకవ్యక్తినో, ఒకప్రదేశాన్నో మనం క్రొత్తగా చూచినపుడు కూడా అవ్యక్తినో, ఆ ప్రదేశాన్నో ఎప్పుడో మనం చూచినట్లూ, మనకు ఎంతో పరిచయమున్నట్లూ అనిపిస్తుంది. దీనికి పూర్వజన్మ వాసనలు కారణమని పెద్దలుఅంటారు. అయితే ఈ విషయాలు హేతువాదులకూ, ఆధునికులకూ చాలా విడ్డూరంగా ఉంటాయి.

కాని మన అభ్యుదయకవి ఆంగ్ల సీమలో పర్యటించి దర్శించిన ప్రదేశాన్ని తానెపుడో చూచినట్లు అనుభూతిని పొందాడు. ధాత్రి ధాత్రీ హృదయం రహస్య వేదనలతో తన పాదాల ముందు మోకరిల్లి నట్లనిపించింది. ఆసియా

తెలుగు లెక్చరర్, 25–6–14 గంటాంవారివీధి, కాకినాడ–533 001.

ఖండపు ప్రమోదు గుండెలలో ఏదో జననాంతర మానుష వేషంతో నిరంతర యాత్రికుడై, ఏ చ్యుత స్వప్నం కోసమో' ఆయన సంచరించినట్లు నిపించింది. (పు 10-11)

అందుకే తాను- పురాతన రక్తాస్థి మజ్జా హృదయాలతో నాగరిక లోకంలో పర్యటించ డానికి అగమించిన ఆధునిక మానవుణ్ణి' (పు 13) అని ప్రకటించుకున్నాడు కవి.

అంతేకాదు. వ్యక్తావ్యక్తాల నడుమ ఒక కాల్పనిక లోకాన్ని నిర్మించుకొని, తనలో నిరంత రం రేగే పంచేంద్రియ సంచలనాన్ని పసిగట్టి కవిత్వీకరించాడు ఆయన.

ముఖ్యంగా పురాచరిత్ర ప్రక్రరణాలను కదిలించే 'బర్మింగ్ హామ్' ను దర్శించినపుడు ఎన్నో అనుభూతులను అవంత్స వారు పొందారట. అలాగే పురాకృత చరిత్రలో చర్మ పరిశ్రమకు ప్రసిద్ధి నొందిన 'వాల్ సాల్' చూచినపుడు 'సీసాలో కళపెళలాడే చిరంతన వేదనలా వీధులలో విర్రవీగే నిరంతర సౌందర్యం (పు 15) అంటూ వర్ణించాడు ఆయన.

ఒక్కొక్క దేశానికి, ఒక్కొక్క ప్రదేశానికి ఆయాచోట్లను బట్టి అక్కడ నివసించేవారి సంస్కృతి, సంప్రదాయం, ఆచార వ్యవహారాలు ఉంటాయి. ఒకచోట నివసించే వ్యక్తి మరో చోటికి ఏదో కారణంగా వెళ్లినా, అక్కడ అతడు నిలదొక్కుకొని, ఆ వాతావరణానికి అలవాటు పడడం కష్ట సాధ్యమే అవుతుంది.

అదే వాల్ సాల్ లో రోజా-డాన్ జువాన్ పరాసు దేశం దివ్య జీవనం తెరిపించినా, పరదేశపు ఉద్యోగాలు చేస్తున్నా తరతరాలుగా రక్తగతంగా ఉన్న వాసనత్వాలను వదులుకోలేక అక్కడి నూతన సంస్కారాలను అలవరచుకోలేక జన్మ భూమిపై మనసు మళ్లుతుండగా సతమతమయ్యే వారి దుస్థితిని గమనించి

'నిద్ర పట్టని కళ్ళను విస్కీగ్లాసుల్లో
కౌగిలం పడవల్లా ఒదులుతారు' (పు 18)

అని ఒక దావ చిత్రాన్ని మనోహరంగా కళ్ళకు గట్టించాడు కవి.

అలాగే 'ప్రిల్యూడ్'లో వర్డ్స్ వర్తు మహాకవి తెల్పిన ఘట్టాలకు తగిన చిత్రాలను సంకలించి ఆతడి నివాస గృహంలో భద్రపరదారని చెప్పి అలాంటి విషయాలలో మనదేశం ఎంత వెనక బడ్డదో అని దిగులుతో క్రుంగిపోయాడు. ఆయన నలభై ఏళ్ళుగా, కలిసి మెలిసి తిరిగి వినిపించిన అభ్యుదయ బృందగానం ఇప్పుడు సొమ్మసిల్లిందని, తానూ అరుద్ర మాత్రమే వారికి ప్రతినిధులుగా మిగలడం వల్ల 'జీవన శశాంకురాలు విగతకాంతితో వివర్ణమయిన ఈకాలంలో తామేమీ చేయలేక పోతు న్నామనీ ఆవేదన పడ్డాడు.

అంతేకాదు, సోమర్ సెట్ మండలంలో చెడ్డార్ గుహాలయాలలో ఆదిమానవుని కంకాళం చూచినపుడు మన శ్రీశ్రీ అనిసెట్టి, పురిపండా తుందుర్తి వంటికవులు కవికి గుర్తుకువచ్చారు. ఆ సందర్భంలో 'మీహృదయోపవనాలలో కోటి కలలతో విరియించిన కాంతి మందారాల మరంద ధామాలను వసి వాడనీయకుండా కాపలాకాస్తు న్నాము' (పు 22) అని వారికి హామీ ఇచ్చాడు కవి. ఇక్కడ ప్రగతిపథంలో ముందుకు సంచరించ డానికి పూర్వ అభ్యుదయ కవులను సహకరించ వలసిందని అడగడంతో సోసు గారికి వారిమీద ఉన్న గౌరవం వ్యక్తమవుతుంది.

సోమసుందర్‌గారి కవిత్వంలో ఆయన చిత్రీకరించే ప్రకృతి దృశ్యాలు మనలను బాగా ఆకట్టుకుంటాయి. అవి ఎంతో సహజ సిద్ధంగా, కళ్ళ ఎదుట కదలాడే చలన చిత్రంలా ఆకర్షిస్తాయి. అలాంటి దృశ్యాలూ, మట్టాలూ ఈ సంకలనంలో చాలా కనబడతాయి.

'వసంతంలో కనులు తెరవని దుర్దినం' అనే శీర్షికలో 'ఆకాశం జీబురుగా జీమూతంలా కొండలలో సంచరించే చలిగా, గాండ్రించే పులిలా తూర్పు పడమర లేకరాశిగా పొగమంచు, మార్పు పిసరంతయినా కనిపించని మసగల గోరంచు' అంటూ చిత్రీకరించడంలో ఇదే కనిపిస్తుంది. (పు 25) అలాగే ఈ పెనుగాలి 'పేరు స్కాచ్' అనే దానిలో—'దుడుకు రెక్కల జడను తొడుగుకొని పెనుగాలి—దక్షిణ ద్వారమును తన్నుకొని పరతెంచె. పని తొందరల నడుమ బిరబిరా పరుగులిడి, ప్రతి చివురు కొన గోట గిచ్చి పక్కన నవ్వే—ప్రతి పూవు చెల నాగ పలుకరించుచుపోయి—ఎంత దవ్వేగెనో—ఎట దాగబోయెనో. అడుగిడినచో చెల్లి మసక బారిన చలువ—కెరటాల పులకలై పుడమి బుగ్గలు కందె (పు 28) అనీ, 'పకపకానవ్వుతూ పరువెత్తుసెలయేళ్ల పిలిచి లాలించి అక్కునజేర్చె పెనుగాలి' అనీ వర్ణించడం ఎంతో హృద్యమనిపిస్తుంది.

ఈ సందర్భంలో ఏ పురాతన మద్యమున మునిగెనో కాని—మత్తుగలిగించేను స్కాట్లండు పెనుగాలి' అంటాడు కవి.

అదే విధంగా గ్లాస్గో నుంచి బస్సులో స్కాట్లండు వెడుతూ చూచిన కొలనులూ—తోటలూ—పొలాలూ—పచ్చిక పట్టులు—పూలు 'కన్నుల దప్పిక తీరుస్తాయని, అది 'ఎదలో సుందరస్వప్న మనీ ఆనందపారవశ్యంతో చిత్రీకరించాడు ఆయన. ఆ సందర్భంలో ఆరణ్యక సౌందర్యము అనురాగ విపంచిగా నిరంతరాయ మానంగ స్రవంతిగా మ్రోగే' స్కాట్లండ్‌ను 'చిరస్వాప్నిక స్వర్గం'లా పేర్కొన్నాడు కవి

ఎందుకంటే వసంతమంటే అక్కడ చిరువెన్నెలవలె లేత యెండ ప్రతి ముంగిట పుష్పాంజలి ఏడురంగుల ఇంద్రధనస్సు నేల కురికి పరిమళించి మెరిసినట్లు గులాబీల తోరణాలు. ప్రతిముంగిట నందనమొక పేలికగా వ్రేలినట్లు పూల జరీబూటా. ఇంతలోనే మసగ మసగ మబ్బులో అంతలోనే వేడి వేడి సూర్యకిరణాలు. చక్కగా నగ్న వితాలాంగి భూమి కనబడదు. అంతా హరితపత్ర సంశోభితమే. కొండనడుము చుట్టుకొన్న సరోవరం సుందరాంగి పెట్టుకొన్న రవల వడ్డాణంలా, కొండ ఒక కొలనుగట్టు నాగి మెడను వంచి నీరు త్రాగే ఒంటెలా ఉంది. స్వర్గ మర్త్యలోకాలకు పర్వతాలే వెలుగుమెట్లు. శుభ్రతకూ సుందరతకూ పల్లెపట్లు కాణాచి. పగటి వాన తెరల నడుమ చెట్లు నిద్ర మగతలలో దోగు నీటి బొమ్మల్లా ఉన్నాయి. అని అంటాడుకవి.

ఆ మనోహర సానువుల్లో సంచరిస్తే కవిత తనకు తానే మేల్కొంటుందనీ, ఆనాటి కాళిదాసుకు లేని యోగం తనకు పట్టిందనీ, మనసు ఒక మేఘ సందేశకావ్యమైందనీ, కర్మ సిద్ధాంతాల మూఢ విశ్వాసాలు కొలను కెరటాల పడి తలలు చెడి అక్కడ వైతాళగుతాయనీ అంటాడు ఆయన. అక్కడి పాదపశ్రేణులు కవికి స్వర్గవీణా తరంగాలు వినిపించాయి. ఒక రసానందమే రూపెత్తి నడయాడినట్లనిపించింది.

కాని కవి' అంతశ్చేతన స్వేచ్ఛా పథగామిగా సకల బంధాలనుంచీ విముక్తమై' నట్లనిపించింది,

ఆభూమి తనది కాదనే స్ఫురణ అహంకార మమకారాలను పటాపంచలొనర్చింది. దాంతో 'మహా ప్రవాహంలో ఒక జలకణంగా', 'కాద్యం సీమలో ఒక గరికపోచ'గా మారిపోయాడు కవి.

అయినా ఆ రమణీయ తరంగాలను అనుభవించే చిరంతన 'ప్రాచేతసుదన' నవచైతన్యం (..గ్నమై) కవి హృదయంలో రోచిర్నివహాల అరుణోదయమైంది కొత్తకోర్కె ఉషోదయం ముని వాకిట వాలింది. నవీన మానవ హృదయంతో నూత్న గాన స్రవంతితో రసానందంలో తేలియాడుతూ 'బరన్సు' కవి నిగన్న 'అయిర్ షైర్'కు వీడ్కోలు చెప్పాడు కవి.

ఆదే సమయంలో లెబనాన్ సరిహద్దుల్లో క్రమ్ముకున్న యుద్ధ వాతావరణాన్ని మనిషి ప్రేగు దండలలో చంద్రవంక మెరుస్తోంది' (పు 44) అని వర్ణించాడు కవి (ఇక్కడ చంద్రవంక అనేది మహమ్మదీయుల జెండా గుర్తు) అంటాడు. ఆకాలాన్ని శిశిరంతో ఉపమించాడు, తామూ దేశంలో అతిథులుగా గడిపే కొద్ది నెలల పాటు వసంతాన్ని ఆగిపొమ్మని అర్థించాడు కవి.

ఆ సందర్భంలో ' మా ఆశల ఆమని వెన్నెలల్ని హతమార్చ నివ్వను—రావద్దు రావద్దు పో పో ఆశలరాల్చే అజ్ఞాత తమస్సూ—ఇంత జీవననాట్యోత్సవ భూమికనూ నీ కఠోరోక్తుల చీకటి తెరలో ముంచకు—ఓ కరుణా రహిత శిశిరపికాచీ—చాల్చాలు—నీ జంజాటం— వెళ్లిపో అని తరిమి కొట్టాడు కవి.

అలాగే మార్క్స్ సమాధిని దర్శించి 'మానవ జాతి నీ కెంత ఋణపడివున్నదయ్యా! నీకెలా సమర్పించ గలను శ్రద్ధాంజలి... ఈ జననాంతం వరకూ నిన్ను కీర్తిస్తూనే ఉంటాను' అని తన ఆత్మీయతనూ, అభిమానాన్నీ చాటుకున్నాడు కవి. అదే విధంగా షేక్స్పియర్ రచించిన 'మేక్బెత్ నాటకాలలో ప్రయోగిన జంత్ర వాద్యాల ప్రకంపన ప్రతిధ్వనుల్ని యేవన్ నదీ హృదయంలో కవి విని పరవశించాడు. బ్రిస్టల్ నగర శివార్లలో ఆర్నోలేక శ్మశానవాటికలో నిద్రిస్తున్న రాజారామమోహన్ రాయ్కి శ్రద్ధాంజలి ఘటించాడు కవి.

ఆ సందర్భంలో—'ఐనా ఇప్పటికీ నీదేశం మూసలి శకుని పాచికలాట'ల కాలవాలమై అరణ్యవాసం చేస్తూనేవున్నది. భారత నారీమణుల వస్త్రాపహరణం నిరాటంకంగా కొనసాగుతూనే వున్నది. యువతుల నగ్న శరీరాలు శృంగాటకాల నిలిపి వేలం పాటలలో అమ్ముడు పోతూనే వున్నవి. పరదేశ శృంగార తల్పాల కోసం అర్పించబడుతూనే ఉన్నవి అత్తల ధనదాహం తీర్చలేని కొత్తకోడళ్లు బలికావించబడుతూనే ఉన్నారు. సజీవ దహనాలకు (పు 82) అని చెప్పి వాపోవడంలో సోమసుందర్ గారి అభ్యుదయ దృక్పథం ప్రదర్శితమయింది.

అలాగే ఇంగ్లండు సూర్యుడి కెంతో చంచల బుద్ధి అంటాడు కవి ఇంతలోనే లేడిమెరుపుల గద్ది' విడిచి 'గంటకోమారు కరిమబ్బు కోటను దూరి 'చింతతో రోదిస్తాడట భాస్కరుడు. అందుకే నింగి పుడమిని వాలి చుంబించు దూరాల — పొగమంచు తెరదింప మరుగ మరుపను పగలు (పు 84) అని మాత్రా ఛందస్సులో ప్రకృతిని చిత్రీకరించాడు కవి.

అదే విధంగా 'లివర్పూల్లో బిట్టర్మియర్' అనే శీర్షికలో 'లివర్పూల్ పిట్టలకీ—మాంచెష్టర్ గానాలకీ నడుమ పడమటి కడలి కెరటాల జాజ్ స-గీతాలు, చిగురుకీ తొడిమకీ నడుమ చిట్లు

గానాలు వినిపించే సీతాకోకచిలుకలు, భూమికీ ఆకాశానికీ నడుమ నల్లని మబ్బు బతుకులు దింపే హిమగమంచు తెరల నేపథ్యశోకాలు (పు 85) అంటూ ఒక వర చిత్రాన్ని కళ్లకు గట్టినాడు కవి అట్టి వర చిత్రమే 'వానదారి'లో కూడా—

'క్షితిజ రేఖల కదల నల్లనల్లని తెరలు
పగటిపై పగబట్టి పడగలెత్తిన ఇరులు
మసగ మసగం నింగి నేలపై పడినట్లు
తడిముద్దబట్టలై సీరుకారే చెట్లు (పు89)

అనడంలోనూ మనోహరంగా ప్రత్యక్షమవు తుంది.

సోమసుందర్‌గారికి ఈ పర్యటన హృదయం పై ఒక గాఢమైన ముద్రవేసింది. ఆయన జీవిత గమనంలో ఒక మైలురాయిలా నిలిచింది. ఆ సందర్భంలో 'హేవర్స్‌లో బ్రాంటీ సిస్టర్సు' ను వారి 'గ్రంథాల కాంతులు మరకత మణుల్లా ప్రకాశిస్తూనే ఉన్నాయి' అని ప్రశంసించారు. 'థేమ్సుబడిలో లండన్'ను దర్శించడంతోటే దాని వెయ్యేళ్ళ చరిత్ర గుర్తుకువచ్చింది కవికి. థేమ్సునదీ రూపం కవిభావనలో స్వచ్ఛ మరాళం'గా సంచరించింది. మధ్యయుగాల చరిత్రలో రెండవచార్లెస్‌ను ప్రజలు కోపంవచ్చి తలనరికిన ఘట్టం, టిపాల్గర్ స్క్వేర్‌లోని యోధుల శిల్పమూర్తుల గాథలు, సెయింట్‌పాల్ కెథెడల్ సుందరశిల్పాలు, బ్రిటిష్ మ్యూజియం కవిని బాగా ఆకట్టుకున్నాయి 'సురాసురులనైజాతికు కాణాచిగా లండన్ నగరం ఆయనకు తోచింది. అలాగే సిరియర్ విమానంలో ప్రయాణిస్తూ 'అమేయమానవమూర్తి'లా తాను భాసించినట్లూ, తన శిర్షానికి సౌరకిరీటం కీలించుకున్నట్లు' ఒక దివ్యానుభూతిని పొందాడు కవి.

అందుకే ఈసందర్భంలో—
'దయచేసి నన్ను క్రిందికి దింపకండి

ఈ అనిర్వచనీయ ఆనంద స్రవంతిని రాళ్ళు రువ్వి గాయపరచకండి (పు109) అంటూ వేడుకొన్నాడు ఆయన.

చివరగా కవి తాను మొదటినుంచీ పొందిన చేదు అనుభవాలను నెమరువేసుకొని ముందురాబోయే కాలాన్ని తలుచుకొంటూ-

'బ్రతుకు పొదుగునా దాగుడుమూతలాడుతూ
సైయంటూ నను పిలచి కనుమరుగై పోతూ వచ్చిన
అదృష్టరశ్మల కాంచన కు రంగం
ఇప్పటికైనా చేతికందేనా ?
తేనెపూసిన కత్తులకీ—అవాలు పోసిన అద్దాలకీనడుమ
నా బ్రతుకునే ప్రహసన మొనరించేనో, ఏమవనీ,
నే నాశాజీవిని,

ఆమరణాంతం కర్తవ్యాలు విస్మరించని
అకుంఠితదీక్షా హృదయుణ్ణి'(పు 112)

అంటూ తన ఆశావాదాన్ని వినిపించాడుకవి.

ముఖ్యంగా ఈ కవితా సంకలనంలో కవి పరిశీలనా శక్తి, భావనాబలం, ప్రకృతి చిత్రీకరణా విధానం, వివిధ స్థల విశేష వివరణం, సుందర మనోహర దృశ్య సాక్షాత్కార ధోరణి కొనియాడదగినవి.

అందుకే సోమసుందర్‌గారి కవిత్వంలో ఇది ఒక ప్రత్యేకతను సంతరించుకొన్న కావ్యం అనడంలో సందేహంలేదు.

# "అద్వైతం-సామ్యవాదం"-తాత్త్విక పరామర్శ

డా॥ టి. బాలసుబ్బయ్య

సుఖలాలసత మానవ ప్రకృతి మానవోత్పత్తి అయినది మొదలు. కేవల సుఖమయమైన జీవితాన్ని గడుపడానికి అవసరమైన మార్గాలను అన్వేషించడం ప్రారంభం అయింది. ప్రపంచంలోనే ఇతరదేశాలు కన్ను తెరువని అనాదికాలం నుండే భారత దేశంలోని మానవుని మేధ అనంతంగా, పరిపరి విధాలుగా 'జీవతత్త్వం అంటే ఏమిటి? సర్వోపద్రవ రహితంగా దేహయాత్ర నిర్వహించడం ఎలా? మొదలైన అనేక విషయాల మౌలిక ప్రామాణ్యాన్ని సహేతుకంగా గవేషించింది. ఈ అపార విజ్ఞానమే దర్శన వాఙ్మయంగా ప్రతిష్ఠ పొందింది.

భౌతిక పదార్థం నిత్యమనీ స్వప్రమాణమనీ, దీన్ని నియమించే అన్యశక్తి లేదనే ప్రాతిపదికపై తమ ఆలోచనను కొనసాగించిన దర్శనాలు నాస్తిక దర్శనాలనీ, పుట్టుక, వృద్ధి, నాశాలనే వికారాలకు లోనయ్యే ఈ జగత్తుకు, దాని కంటే భిన్నమై, సచ్చిదానంద మయంగా ఉండే ఏదో శక్తి ఆధారంగా ఉందనే అనుమానం ప్రధానంగా తమ ఆలోచనలను కొనసాగించినవి. ఆస్తిక దర్శనాలనీ ఒక విభాగం ఏర్పడింది. చార్వాక దిగంబరాలూ, బౌద్ధ దర్శనాలు నాలుగూ కలిసి మొత్తం ఆరు నాస్తిక దర్శనాలు, సాంఖ్యాయోగాలు, న్యాయవైశేషికాలూ, పూర్వ, ఉత్తర, మీమాంసలూ మొత్తం ఆరు ఆస్తికదర్శనాలు. వీటిలో ఉత్తర మీమాంసకే వేదాంతదర్శనం అని పేరు.

విమర్శ అనేదాని పరిపూర్ణమైన, శాస్త్రీయమైన విచికిత్సయొక్క చిట్టచివరి స్థాయినే భారతీయ తత్త్వవేత్తలు 'మీమాంస' అని వ్యవహరించారు. విమర్శలో దీనికంటే ఉన్నతమైంది లేదు. 'ఉత్తరమీమాంస' అంటే – అన్నిటికంటే తర్వాతిదైన మీమాంస అనీ సర్వోత్కృష్ట మీమాంస అనీ అర్థం. ఇది ఎప్పటికీ + 1గానే ఉంటుంది. ఏ విషయాన్నిగురించి ఎందరు ఎన్ని విధాలుగా చెప్పినా, ఆ విషయంలో ఇది వాటన్నిటికంటే ముందుగానే ఉంటుందనేది ఉత్తర మీమాంస అనేపాదంలోని సార్థక్యం. అందువల్లనే వేదాంత దర్శనంతో దర్శనవిజ్ఞానం పెరుగుదల నిలిచిపోయింది. దీంట్లో ద్వైతం, విశిష్టాద్వైతం, అద్వైతం అనే సంప్రదాయ భేదాలున్నాయి వీనిలో అద్వైతం చిట్టచివరిదీ అనుత్తమమైనదీ. ప్రాణశక్తితోనిండిన మానవుని మేధాశక్తి విస్తరింపజేయగల్గిన ఆలోచనావైశాల్యానికి అంతిమ సీమారేఖది అద్వైతం. దీనిప్రవర్తకుడు వ్యాస మునీంద్రుడు. వ్యాసుడంటే బుద్ధివిస్తృతిరిసరిహద్దు.

---

తెలుగు లెక్చరర్ 9-3-34, మోహినీపూర్ సిద్దిపేట-502 103 మెదక్.

'నమోస్తు తే వ్యాస విశాలబుద్ధే' అనే స్తుతి ఆ మహనీయుని విషయంలో అక్షరసత్యం.

## అద్వైతంలోని సంప్రదాయభేదాలు

అద్వైతం అనే దాన్ని విశ్లేషించడంలో పెక్కుభేదాలు కనపడుతున్నాయి. వానిలో శివాద్వైతం, శాక్తాద్వైతం అని రెండు ప్రధానభేదాలు.

శివం—అంటే ఆనందం. మానవ జీవిత పరమావధి అయినది సుఖం. సుఖ ప్రాప్తికోసమే మానవుడు నిరంతరం తపిస్తుంటాడు. ప్రయత్నిస్తుంటాడు. తన సుఖంకోసమై ఏమి చేయడానికైనా వెనుకాడడు, తన సుఖంకొరకే ధనాన్నీ భార్యాపుత్రాదులనూ స్వీకరిస్తాడు, అయితే వీటన్నిటి కంటే తన సుఖమే ప్రధానం.

''ఆపదర్థం ధనం రక్షేత్. దారాన్ రక్షేత్ ధనైరపి।
ఆత్మానం సతతం రక్షేత్ దారైరపి ధనైరపి॥

అనేది పెద్దల అనుభవం. ఆపదలనుండి కాపాడుకోవడానికి ధనాన్ని సేకరించుకోవాలి. ధనం పోయినా భార్యాపుత్రాదులను కాపాడుకోవాలి. కానీ ఎల్లప్పుడూ తననుతాను ధనం, భార్యాపుత్రాదుల కంటే మిన్నగా—వాళ్ళనుకూడా నాశనం చేసైనాసరే రక్షించుకోవాలి. అవసరమైతే తన సుఖంకోసం లోకాన్నే నాశనంచేసినా ఫరవాలేదు—'ఆత్మార్థం పృథివీం త్యజేత్—అనేది అనుభవంలో తేలిన సత్యం.

దీనివల్ల జీవుడు స్వార్థపూరిత (స + అర్థ—తనే విషయంగాగల) సుఖస్వరూపుడు అనేది తేలిన సారాంశం. ఇక్కడ సుఖంఅనేదాని విషయంలో క్షణికం — శాశ్వతం అనే భేదాలున్నాయి. దాని విషయమై తర్వాత చర్చిద్దాం.

జీవునికి—ఆతని సుఖానికి అభిన్నత. జీవి తన సుఖంలో అద్వైతస్థితిని పొందటమే-శివాద్వైతం అని అర్థం. ఇది శివసారమ్యం.

సమస్త జీవరాశికీ ఈ నియమం సమానంగా వర్తించినా, మిగతా జీవరాశికంటే భాష, వివేకం అనే అధిక సౌకర్యాలవల్ల సిద్ధించిన అంతఃకరణం అనేది ప్రధానంగా ఉన్న మానవునికే ఇవన్నీ ముఖ్యంగా ఉద్దిష్టమైనాయి. ఇక్కడ జీవుడంటే మానవుడనే సాధారణార్థం.

అయితే సుఖం కలుగడానికి ప్రయత్నం అవసరం. ప్రయత్నానికి శక్తి కావాలి. శక్తి లేకుంటే ఏ పనీ జరుగదనేది అనుభవసత్యమే. శక్తి సముపార్జనమే జీవిత పరమావధి శక్తిమంతునికి అసాధ్యం ఉండదు. ఇక్కడ మానవునికీ—శక్తికీ అభిన్నత. అంటే శక్తితో మానవుడు అద్వైతస్థితిని పొందడమే శాక్తాద్వైతం ఇది శక్తిపారమ్యం

వ్యవహారంలోనే శివాద్వైతం. శాక్తాద్వైతం అని భిన్నంగా వ్యవహరించడం జరుగుతున్నది. వాస్తవంగా ఈ రెండూ భిన్నాలుకావు. సుఖానికీ—శక్తికీ కూడా భేదం లేదు. శివ + అద్వైతం—అని విడదీస్తే శివునితో-ఆనందంతో అద్వైతం అనీ, శివా × అద్వైతం—విడదీస్తే శివా అంటే (దుర్గ—దుఃఖేనగమ్యత ఇతిదుర్గా—అంటే కష్టపడి సాధించవలసిన శక్తి అని అర్థం శక్తితో అద్వైతం అనీ ఒక్క శివాద్వైతం అనే సమాసానికి సిద్ధిస్తుంది. అంటే ఇక్కడ శాక్త—శక్తులకు అభేదం. శక్తుడు—అంటే శక్తి కలవాడు—శివుడు. శక్తి (దుర్గ)—శివా.

వీరిద్దరి సమ్మేళనమే జగత్తు. 'జ' అంటే పుట్టి, 'గ' అంటే నశించేది అని అర్థం. ప్రకాశించేది అనేది.

శివుడు—ఆనందం, దుర్గ—శక్తి అనేవాటిలో దేనికి ప్రాధాన్యం అనే దానిపై భేదాభిప్రాయాలు న్నాయి. (ఇక్కడ శివుడు—శక్తి అనందంలో పూజలకై ఏర్పాటు చేసుకున్న విగ్రహాలు కాదు.

శక్తి ప్రాధాన్యాన్ని అంగీకరించి, మానవునికీ శక్తికీ అభేదం అని భావిస్తే—దాన్ని భౌతికాద్వైతం అంటారు.

శివ ప్రాధాన్యాన్ని అంగీకరించి, మానవునికీ ఆనందానికీ అభేదం (సుఖమనానంత చిన్మాత్ర రూపస్థితి) అని భావిస్తే దాన్ని భావాద్వైతం అంటారు.

అంటే ఇక్కడ మూడు విధాలైన అద్వైతా లున్నాయి.

శక్తి—మానవునికీ అద్వైతం.
ఆనందానికీ—మానవునికీ అద్వైతం.
ఆనందానికీ—శక్తికీ అద్వైతం

ఈ మూడింటి ఐక్యానుసంధానమే అంటే త్రివిధైక్యమే సర్వోత్కృష్టసత్యం.

## శివ—శక్తుల సామరస్యం

శివం అంటే సుఖం—ఆనందం ప్రకాశ స్వరూపమనీ, శక్తి—విమర్శస్వరూపమనీ, ఈ రెంటికీ సామరస్యాన్ని అనుభవంలో సాధించడాన్నే అద్వైతానుభూతి అంటారు

ఒకే ప్రకాశం (చైతన్యం భిన్నస్ఫురణలతో అనంత భేదాలుగా భావింపబడుతున్నది. మూలతత్త్వమైన ప్రకాశంలో భేదం లేకున్నా దాని శక్తులు లేదా వృత్తులు భిన్నంగా ఉండటంతో అపారమైన వైవిధ్యం ఏర్పడింది. ఈ వైవిధ్యాన్ని విశ్లేషణతో విమర్శిస్తే సామరస్యం సిద్ధిస్తుంది. ప్రకాశానికి స్ఫురణకూ అభేదమనీ అంటే ఆ రెండూ ఒక్కటే అనే అద్వైత భావనను ఆచరణ ద్వారా అనుభవించడాన్నే అనుభవవేత్తలు సామరస్యం అన్నారు—

ఏకమేవ యదామ్నాతం భిన్నం శక్తి వ్యపా
శ్రయాత్ ।
అప్పథక్త్వేపి శక్తిభ్యః పృథక్త్వేనేవ వర్తతే ॥

సజాతీయ విజాతీయ స్వగత భేదరహిత మైన సత్తామాత్ర స్థితి ఒక్కటే దీన్నే ఉపనిషత్తులు బ్రహ్మము అన్నాయి. సత్త్వము, రజస్సు, తమస్సు అనే గుణాలతో కూడిన పదార్థం ఈ బ్రహ్మమును ఆశ్రయించి ఉంది. దీనికి అనేక విలక్షణమైన శక్తులున్నాయి. దీనివల్ల అద్వితీయమైన బ్రహ్మములో నానాత్వం భాసిస్తున్నది. అయితే వాస్తవంగా బ్రహ్మము ఈ శక్తులకంటే భిన్నం కాకపోయినా, శక్తులు పరస్పరం భిన్నాలైనందువల్ల భిన్నత్వం కలుగుతున్నది.

దీన్నే మరో విధంగా కూడా చెప్పారు—
ఏక ఏవ ద్విధా భూత్వా ద్విధాచ బహుధాపునః
తద్బహుత్వం—విమృష్టంచేత్ ఏక ఏ వావ
శిష్యతే ॥

నిరాకార నిర్గుణమైన ఒకే అధిష్ఠాన సత్తా మొదట సగుణంగా భాసించింది. సగుణం సాకారత్వాన్ని పొంది రెండుగా అయింది. గుణానికి వృత్తులు అపారం. వృత్తులే శక్తులు. వీని భేదం నానాత్వాన్ని కలిగించింది. అనంతత్వం వైరుధ్య

కారణమైంది. ఈ బహుత్వాన్ని విమర్శించి గ్రహిస్తే ఏకమైన అధిష్టానమే మిగులుతుంది. సారాంశం ఏమంటే— ఈ భావ, భౌతిక తత్త్వాలు రెండూ ఒకే నాణానికి రెండు ముఖాలుగా ఉండే బొమ్మ, బొరుసూలాంటివి. వీటిది అవినాభావసంబంధం.

## అద్వైతం—మార్క్సిజం సామ్యభేదాలు

1. రెండు తత్త్వాలు లేదా రెండు వర్గాలుండటం సంకటాలకూ, సంఘర్షణలకూ కారణమౌతుందని అటు భావవాదులైన భారతీయ వేదాంతులూ, ఇటు ఆధునిక భౌతికవాదులైన మార్క్సులాంటి వాళ్ళూ అంగీకరించినదే, రెండుగా ఉండటం అనే వైషమ్యభావనను సాధన ద్వారా తొలగించి ఐక్యస్థితిని సాధించాలని అద్వైతం ఉద్ఘాటిస్తే, వర్గ పోరాటాల ద్వారా సమసమాజాన్ని స్థాపించవచ్చని మార్క్సు భావించాడు.

ద్వంద్వ భావన (రెండువేరు అనే భావన) సర్వనర్థాలకూ మూలమని భారతీయ విజ్ఞానానికి, చింతనకూ మూలకందాలైన వేదాలు సిద్ధాంతంగా చెప్పాయి 'ద్వితీయాత్ వై భయం భవతి' అనేది శ్రుతి వాక్యం. ద్వితీయాత్— తనకంటే భిన్నమైన రెండో పదార్థం వల్ల, వై —నిరంతరం నిశ్చయంగా (సిద్ధాంతంగా), భయం— ఆపద, వైరుధ్యం, సంఘర్షణ, అపకారం, భవతి— కలుగుతూనే ఉంటుంది. అందువల్ల ద్వైతభావనను తొలగించుకొని ఏకమైన— అద్వితీయ స్వరస సుఖఘనానంత చిన్మాత్రస్థితిని పొందటం అంటే తనకంటే భిన్నమైన రెండోవస్తువులేదని, స్వభావంగా రసమయమైనది అంటే తనకు తనే ఆస్వాద్యమానమైనదీ అఖండ (ఇష్టమైనది), సంపూర్ణంగా ఘనరూపమైన సుఖమైనదీ అఖండ జ్ఞానరూపమైనదీ అయిన బ్రహ్మస్థితి ఒక్కటే అనే భావననే సమస్త వైషమ్యాలనూ తొలగిస్తుంది అని అద్వైత భావనధార సిద్ధాంతీకరించింది.

మార్క్సు మహాశయుడు లౌకికమైన ధనాన్ని ఆధారంగా ఉన్న వాడు— లేనివాడు అని సామాజికంగా రెండు ప్రధాన వర్గాలేర్పడుతున్నాయన్నాడు. ధనహీనులు అంటే శారీరక శ్రమచేస్తూ ఉత్పత్తులు పెంచే శ్రామికులు— కార్మికులవర్గం అనీ, వారి శ్రమకుతగిన వేతనాన్ని పొందలేక శ్రమ దోపిడికి గురి అయ్యే వారినీ మార్క్సు విశ్లేషించాడు. ధనవంతులు అంటే పెట్టుబడిదారులు కర్మాగారాలను స్థాపించి అనేక వేలమంది కార్మికుల శ్రమద్వారా అధికోత్పత్తులను సాధిస్తూ, శ్రామికులకు చాలీచాలని కూలిడబ్బులు మాత్రమే ఇస్తూ అధిక లాభాలను ఆర్జించే గుత్తదారుల్ని వ్యాఖ్యానించాడు. పెట్టుబడిదారుల దుర్మార్గాలను విసిగిపోయిన కార్మికవర్గం సంఘటితశక్తిగా ఏర్పడి పోరాడి యాజమాన్యాన్ని చేజిక్కించుకోవడం ద్వారా సమత్వం సాధింపబడుతుందని అంచనావేశాడు, ఇక్కడదీన్ని థీసిస్ ధనవంతుల దౌర్జన్యం, అంటిథీసిస్ దాన్ని ఎదుర్కొవడాని సంఘటితమైందని ధనహీనుల ఐక్యశక్తితో కూడిన పోరాటం, సింథసిస్— పోరాట ఫలితంగా సర్వవర్గవైషమ్యాలూ నశించిన పూర్ణ సామ్యవాదం అనే సామరస్యం సిద్ధిస్తుందని-సమాజంలోని ఆర్థిక అసమానతవల్ల ఏర్పడిన ఎగుడు దిగుడు వైరుధ్యాలను విశ్లేషించే (థీసిస్-అంటిథీసిస్ సింథసిస్) ఒక చక్రవర్తనంగా సిద్ధాంతీకరించాడు.

తనవల్ల ఇతర జగత్తుకు ఏమాత్రమూ బాధ కలిగించని విధంగా—

'అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ
నిర్మమో నిరహంకారః సమ దుఃఖ సుఖః క్షమీ॥' గీత 13–12

ఎవ్వరినీ ద్వేషించకపోవడం, మిత్రత్వం, కరుణ, అహంకార మమకారాలు లేకపోవడం, సుఖదుఃఖాల పట్ల సమానంగా ఉండటం, సహన శీలం మొదలైన విధంగా ఉండే వ్యక్తిగతమైన వ్యష్టి సాధనవల్లనే సర్వదుఃఖాలకూ మూలమైన ద్వంద్వ భావనను నిర్మూలించవచ్చని అద్వైతం చెప్తుంది. ధనవంతులనే ఒక వర్గాన్ని పోరాటం ద్వారా బలవంతంగా కూలద్రోసి, సమూలంగా నాశనం చేసే సమిష్టి సంఘటిత శక్తి వల్లనే సమస్త వర్గ వైరుధ్యాలూ నశించిన, ద్వంద్వ భావరహితమైన పూర్ణసామ్యవాదం సిద్ధిస్తుందని మార్క్స్ భావించాడు.

4. సంస్కరణ వ్యక్తిలో, అహింసా విధానంతో, వ్యష్టిగా ప్రారంభించాలని అద్వైతమూ, సంఘటితమైన హింసా విధానంతో సమిష్టిగా సమసమాజం ఏర్పడుతుందని మార్క్స్ ప్రతిపాదించాడు.

5. మానవుని ప్రకృతి, మనస్తత్వం అనే వానికి అద్వైతం ప్రాధాన్యం ఇస్తుంది. వీని ఆధారంగా ఏర్పడిన కామ, క్రోధ, లోభ మోహ, మద మత్సరాలనే అరి షడ్వర్గ నేపథ్యంలో మానవ జీవితాన్ని విశ్లేషించింది. సమాజంలోని వైషమ్యాలకు వీటినే కారణంగా పేర్కొంది. దేశకాలాలతో నిమిత్తం లేకుండా సార్వజనీనమైన కొన్ని మూల సూత్రాలను సర్వ వైరుధ్యాలనూ నివారించడానికై ఏర్పరచింది. కల్లోల కారణమైన వ్యక్తి యొక్క కోరికలు (కామం), ధనం అనే పురుషార్థాల దుష్ప్రభావం సమాజంపై బలంగా ఉంటుందని చెప్పి, ధర్మం మోక్షం అనే సంక్షేమకారకమైన రెండు ఉత్తమ పురుషార్థాల మధ్యన బిగించి (ధర్మ, అర్థ, కామ, మోక్షములు) వాని తీవ్రతను తగ్గించే ప్రయత్నం చేసింది. ధర్మం—అంటే మానవుడు తన బాధ్యతను ఆచరణద్వారా ఎవ్వరికీ బాధ కలుగని విధంగా నిర్వహించి, మోక్షం అంటే అన్ని బాధలనుండీ విముక్తుడై పూర్ణ సుఖంతో జీవితాన్ని గడుపాలని జీవన్ముక్తుడుగా సిద్ధాంతీకరించింది—

సర్వేపి సుఖిన స్సంతు సర్వే సంతు నిరామయాః।
సర్వే భద్రాణి పశ్యంతు మాకశ్చిద్దుఃఖ భాగ్భవేః॥

అనేది అద్వైత దృష్టి పరమార్థం.

చారిత్రక భౌతిక వాద నేపథ్యంలో ప్రతిక్షణం మారే పరిస్థితులను బేరీజు వేసుకుంటూ ప్రణాళికలను నిర్ణయించడాన్ని మార్క్సిజం ప్రోత్సహించింది. నైతికత మనస్తత్వం అనే విషయాలను మూఢవిశ్వాసాలుగా త్రోసిపారేసి, కేవలం ఆర్థిక స్థితిగతులపైననే సమాజాభ్యుదయాన్ని మార్క్స్ భావించాడు. సార్వకాలికమైన ధర్మ సూత్రాలలో ఉండే ఆదర్శవాదం పనికిరాదంటూనే ప్రపంచ పరిణామానికీ, మానవ సమాజ పరిణామానికీ సంబంధించి సర్వత్ర వర్తించే మూల సూత్రాల కోసం మార్క్స్ యత్నించాడు. ఒకరు చెప్పిన సార్వకాలిక సూత్రాలు అశాస్త్రీయం అంటూ సాధారణీకరణ విధానాన్ని తృణీకరించి, అగు మళ్ళీ 'ఎప్పటికైనా అన్వయించే సామాజిక సూత్రాలను నిర్ణయించగలిగామంటే వాటిని ఆధునిక భౌతిక శాస్త్ర సూత్రాల్లాగా సామాజిక శాస్త్రాన్ని కూడా ఏ పరిస్థితులకైనా అన్వయించుకోవచ్చు.

అదే–స్వవచన వ్యాఘాతమైన —సాధారణీకరణను ఆశావాదిగా భావించాడు. (మార్క్సిజం అంటే ఏమిటి? మూలం ఎమిలీబరన్స్ తెలుగు అనువాదం పుట 9).

'వ్యక్తి ఆచరణ ద్వారా హింసాయుతమైన దోపిడీ విధానం నశించదనీ, దాన్ని ఎదుర్కొని పోరాడి నాశనం చేస్తేనే శాంతి స్థాపించగలమనీ మార్క్స్ ప్రతిపాదించాడు. (పుట71).

వర్గపోరాటాలు అనివార్యం అంటూనే తాను భావించిన కార్మిక వర్గం తప్ప (కమ్యూనిస్టు) సమాజంలో క్రొత్తవర్గాలు ఏర్పడటానికి అవకాశం లేదని జోస్యం చెప్పారు (పైది పుట. 69).

కార్మిక పోరాటం కొట్లాటలుగా పరిణమించినా నిత్యమూ కార్మికవర్గ ఏకత విస్తరిస్తుందని కలలుకన్నాడు. మేనిఫెస్టో–తెలుగు (పుట. 42)

'ఫ్యూడల్ సమాజాన్ని ధ్వంసంచేసి ఉద్భవించిన బూర్జువా సమాజం పాత వర్గాలకు బదులు కొత్త వర్గాలనూ, పాతదమన పద్ధతులకు బదులు కొత్తదమన పద్ధతులను పాత పోరాట రూపాలకు బదులు కొత్త పోరాట రూపాలనూ నెలకొల్పింది– (మేని ఫెస్టో–33) అంటూ మార్క్స్ విశ్లేషించిన లోపాలే, మళ్ళీ ఆయన ప్రతిపాదించిన కార్మిక నియంతృత్వాన్ని కూడా క్రీనీడలై ఆవరించాయి. ఆధునిక కాలంలో మార్క్సిస్టు దృక్పథంవల్ల (పోరాడటం– హింస అనే మూల సూత్రాలవల్ల) అంతర్జాతీయంగా ఆలోచనా విధానంలో మార్పు వచ్చిందనే విషయం నిర్వివాదం, అయితే ఈనాడు ఆయన ఆశించిన ప్రపంచ కార్మికుల ఐకమత్యం సిద్ధించక పోవడమే గాకుండా వైషమ్యాలు పెచ్చు పెరగడం, మానవ సంబంధాలు పూర్తిగా తుడిచి పెట్టుకు పోవడం, తీవ్రవాదం, ఉగ్రవాదం లాంటి సమాజ విచ్ఛిన్నకర భావజాల ప్రభావం, మందు పాతరల్ల, భాషలు సంస్కారం మొదలైనవి. ప్రపంచ సమాజాన్ని కుదిపి వేస్తున్నాయి. కమ్యూనిస్టు సమాజ భూతల స్వర్గంగా భావితమైన సోవియట్ రష్యా విచ్ఛిన్నమైంది. అశాంతి మానవ జీవితంలో భాగం అయింది,

'ఒకవ్యక్తి మరోవ్యక్తిని దోపిడీ చేయడం ఏ మేరకు అంతమొందింప బడుతుందో ఆ మేరకు ఒక జాతిమీద మరొక జాతి చేసే దోపిడీ అంతమొందింపబడుతుంది. ఒకజాతిలోని భిన్నవర్గాల మధ్య వైరుధ్యం ఏ మేరకు అంతరిస్తుందో ఆమేరకు ఒక జాతికి వేరొక జాతికి మధ్య ఉండే శతృత్వం కూడా అంతరిస్తుంది'– (మేనిఫెస్టో–54) అని మార్క్స్ సిద్ధాంతీకరించాడు. చారిత్రక భౌతిక వాద నేపథ్యంలో సమాజాన్ని శాస్త్రీయ దృష్టితో [illegible]ంచి అనితర మూఢ విశ్వాసం, ఆశావాదం లాంటి వాటిని చేర నివ్వకుండా విజ్ఞాన శాస్త్రమంత వాస్తవంగా సంపూర్ణం,గా సమాజానికి వర్తించే సామాజిక సూత్రాలు మార్క్స్ నిలిపెట్టాడని ఎంత భుజాలు ఎగరేసుకున్నా–ఇక్కడ మార్క్స్– వ్యక్తి ప్రాధాన్యానికి వాని మన సత్వానికీ, ఆశావాదానికీ దాసుడై ప్రాతపాటనే పాడక తప్ప లేదు. నీవు–నేను, నీది–నాది అనేవిధంగా ఉండే స్వార్థపూరిత వర్గ కక్షను వ్యక్తిగతంగా అణుచుకొని (ఎదుటి వాడిని నాశనం చేసికాదు) సామరస్యాన్ని పొందితేనే సామాజిక శాంతి కలుగుతుందన్నది భారతీయ (ఉపనిషత్ స్ఫూర్తి సాధిత) అద్వైత చింతన సారం–

**సహనావవతు** సహ నౌ భునక్తు సహ వీర్యం కరవావహై తేజస్వి నావధీత మస్తు మా విద్విషావహై బ్రహ్మము మన విజ్ఞానము, మన ఆచరణ

మనలను రక్షించుగాక మనల శిద్ధనిసీ పోషించుగాక మనపిద్దరమూ శక్తి సంపన్నులమై ఉద్యమింతుము గాక, మన అధీతము—అనుభవము చురుకుగా ఉండి ఫలవంతమగుగాక మనం పరస్పరం ద్వేషించ కుందుముగాక అంటూ ఉపనిషత్తులు అనేక విధాలైన శాంతి విధానాలను ప్రతిపాదించాయి.

6. మార్క్సిజం ఊహాజనిత తత్త్వబోధపై ఆధారపడ లేదు అనుకుంటూనే 'సమస్త వర్గ వైరుధ్యాలూ సమూలంగా అంతరించినప్పుడే ఒకవ్యక్తిని మరోవ్యక్తి దోపిడీ చేయడం అనే భావాలు సంపూర్ణంగా అంతరించి పోతాయి' (మేనిఫెస్టో- 53) ప్రతి ఒక్కడూ స్వేచ్ఛగా అభివృద్ధి చెందినప్పుడే అందరూ స్వేచ్ఛగా అభివృద్ధి చెందగల నూతన సమాజం సిద్ధిస్తుంది' (మేనిఫెస్టో 56) అనేవిధంగా తన శాస్త్రీయ విశ్లేషణను ఆశావాదమనే ఊహల పల్లకిలో ఊరేగించక తప్పలేదు. మూఢనమ్మకాలను తొలగించడం వల్ల మానవులు శాస్త్రీయంగా ముందుకు పోయే మార్గం చూపే కార్యాచరణను మార్క్సిజం సూచిస్తోందని (ఎమిసిబరన్స్ 91) అనుయాయులు ఎంత కావించినా ఏనాటికైనా సమస్త వర్గ వైరుధ్యాలూ నశిస్తాయనే (మూఢ) నమ్మకంలోనే ఈ విశ్లేషణ పర్యవసించింది.

ఆదిమ కమ్యూనిస్టు సమాజమని మార్క్స్ పేర్కొన్న ప్రాచీన సమాజంలో మాత్రమే ఇలాంటి వర్గరహిత స్వేచ్ఛాయుత లక్షణాలన్నీ ఉంటాయి ఇలాంటి సామాజిక స్థితినే కృతయుగ లక్షణంగా మహాభారతం పేర్కొంది.

'న రాజా న చ రాజ్యంచ నదండో న చ దాండికః
ధర్మేణైవ ప్రజాః సర్వాః రక్షంతస్మ పర స్పరం॥'

కృతయుగంలో వర్గాలులేవు, పోరాటాలూ లేవు. రాజు రాజ్యాంగం, పరిపాలనా విధానం, పోలీసు వ్యవస్థ. శిక్షా స్మృతి, న్యాయస్థానాలూ, నేరాలూ, ఆరోపణలూ విచారణలూ, శిక్షలూ, దండితులు, దాండికులూ (దండించేవారు) అనే విషయాలే ఆనాటి సమాజానికి తెలియదు. అయినా సామాజిక జీవనం సజావుగా, ఆనందంగా, సమానావకాశాలతో, స్వార్థరహితంగా, స్వేచ్ఛగా, పరస్పర సామరస్యంతో సాగుతుండేది. పనిచేసే బాధ్యతను అంతా సమానంగా స్వీకరించి ఉభయ తారకంగా వర్గరహితంగా జీవనాన్ని గడపడమే దీనికి కారణం.

నిజానికి అదే అసలైన ప్రజాస్వామ్యం, అలాంటి కాలమే మళ్ళీ రావాలనుకోవడం ఆశ అయినా కావాలి, లేక అలాంటి కాలానికి తిరిగి వెళ్ళ డమనే ప్రతీప గమనమయినా కావాలి. ఈ రెండూ అందుబాటులో లేనివే.

భయకారణమైన రెండో పదార్థ స్థితిని నిషేధించిన ధార్మిక అద్వితీయ భావనామ భవం సర్వోత్కృష్ట జీవన్ముక్త స్థితి అని అద్వైతం సిద్ధాంతీకరిస్తే సమాజం చైతన్యవంతమై, ఆర్థికంగా సర్వవర్గ వైషమ్యరహిత—స్థితిని ఆచరణలో పొందడం ఉత్కృష్ట సమ సమాజస్థితి అని మార్క్స్ సిద్ధాంతీకరించాడు. అది భావ నామయమైనా, భౌతిక విశేషణాత్మకమైనా రెండూ సమాజానికి అత్యంతావశ్యకమైనవే. అయితే ఆచరణలో రెండూ కష్టసాధ్యమైనవే.

స్వార్థ భావ సంకుచితమైన పైశాచిక నేర ప్రవృత్తే జీవన విధానంగా మారిన ఈనాటి సమాజాన్ని ఏ ఆలోచనా విధానం మంచి మార్గానికి మళ్ళిస్తుందో కాలమే నిర్ణయించాలి.

# "బైండ్ల కథల్లో వస్తు వైవిధ్యం"

డా॥ చింతల యాదయ్య

జానపద విజ్ఞానానికి పల్లె పట్టులు ఆట పట్టులు. జానపద విజ్ఞానాన్ని జ్ఞప్తికి తెచ్చే సంఘటనలు ఎన్నో ఉంటాయి. జానపద విజ్ఞానానికి, జానపదుల జీవితంలో చోటు చేసుకునే వివిధ సంఘటనలకు అవినాభావ సంబంధం ఉంటుంది. జానపదుల ఆచార వ్యవహారాలు, వినోదాలు, వేడుకలు, ఉత్సవాలు, ఉర్సులు సంబరాలు జానపద విజ్ఞానానికి భాష్యం చెబుతాయి. జానపదుల జీవితాలలో ఈ పండుగలు, పబ్బాలు, జాతరలు, ఉత్సవాలు నూతన చైతన్యాన్ని, గొప్ప ఆత్మ విశ్వాసాన్ని కలిగిస్తాయి. జాతరలు అచ్చమైన జానపదుల పండుగలు. ఈ జాతరలు సామాజిక జీవనంలో సామూహికంగా సంఘటిల్లే భావ జాలాన్ని పెంపొందిస్తాయి. ఇవి గ్రామీణ విశ్వాసాలకు దర్పణం పడతాయి

జానపద విశ్వాసాలను ఆచార సంప్రదాయాలను ఒక తరం నుండి మరొక తరానికి, ఒకరి నుండి మరొకరికి ప్రసారంచేసే ముఖ్య వాహకులుగాను, అను సంధాన కర్తలుగాను కొన్ని ప్రత్యేకమైన కులాలకు, తెగలకు చెందిన వ్యక్తులు వ్యవహరిస్తారు. వారే వృత్తి గాయకులు. వారు తాము పాడే పాటల ద్వారా, చెప్పే కథల ద్వారా జానపదులకు వినోదాన్ని విజ్ఞానాన్ని కలిగిస్తారు. వారిలో ప్రధానంగా పేర్కొనదగినవారు బైండ్ల (బవనీలు) బుడగ జంగాలు, బీరన్నలవారు, దాసరులు, పిచ్చుకుంట్లవారు, శారద కాండ్రు, వీరముష్టివారు, భాగవతులు, సుద్దుల గొల్లలు, గంగిరెద్దులవారు, బాల సంతువారు, బుడబుక్కల బొమ్మలాట కాండ్రు, రుంజలవారు, హరిదాసులు.

తెలంగాణంలో వృత్తి గాయకులుగా పేరు గాంచినవారిలో బైండ్లవారు ప్రముఖులు. ఈ వృత్తి గాయకులు వల్లి, మారమ్మ, మైసమ్మ, భవాని, దుర్గ, కాళి మొదలైన పేర్లు కలిగిన శక్తిని ఆరాధించి ఆమె గుణ గానం చేసి, ఆటలు పాటలు పాడుతూ జీవనం గడుపుతారు. పేరు ఏది చెప్పినా అది శక్తి రూపమై భవాని దేవియే వీరికి ఆరాధ్య దైవం. అందుచేత భవానిని కొలుచువారు బవనీయులు. వీరినే వ్యవహారంలో బైండ్ల వారుగా పిలుస్తారు. వీరిని గురించి

పరిశీలించిన త్రేడే వారి ఆకారం. వాళ్ళ జన్మవృత్తాన్ని జన్మ వ్యవహారంలో నున్న ఒక పద్యం ఎలా వర్ణించాడో గమనిద్దాం.

లెక్చరర్, కోఠి, మహిళా కళాశాల, హైదరాబాద్–500 195

॥సీ॥ దీర్ఘకాయము కల్గి ధైర్యవంతుడయ్యి
పాదాల జీరాడు పంచె గట్టి
బుగ్గ మీసంబులు పూర్ణ దృఢత్వంబు
తెల్లని తలపాగ తేజమలర
చెనయు దక్షిణ చేతి సింహ తలాటమ్ము
జమిడిక వాయిదంకను ధ్వనింప
కాళ్ళకు గజ్జెలు ఘల్లు ఘల్లుని మోగ
నుదట కుంకుమ బొట్టు నదిజ్వలింప

''తే'' శాంభవి దుర్గ మహాకాళి జగము మాట
ప్రకృతి దేవికి పుత్రుడు భవ్యశాలి
అతడె బవనీడు జనపదుడాది శక్తి
మహిమల న్నుగ్గడించెడు మానవుడు.

అట్లే-

కాశీ ఖండంలోని ఏడవ ఆశ్వాసంలో—

॥ప్రణుతించు ఏక వీరా దేవి నొకవేళ
బవనీడయి సమగ్ర భక్తి గరిమ''

అనే ప్రయోగాన్నిబట్టి చూస్తే శక్తిని ఆరాధించే బుక్ గాతాకుడైన భక్తుడు 'బైండ్ల' అని చెప్పవచ్చు. వీరు వంశపారంపర్యంగా గాథలు చెబుతూ శక్తి గొప్ప వర్ణిస్తూ గ్రామ గ్రామాల్లో భిక్షాటన చేస్తూ ఉంటారు. వీరు చెప్పే కథలు—

(1) మాత పురాణం (2) ఎల్లమ్మ కథ. (3) శక్తి కల్యాణం (4) రేణుకాయుద్ధం (5) మలిశెట్ల యుద్ధం (6) మాంధాత కథ మొదలైనవి.

బవనీలు గానం చేసే కథల్లో మాత పురాణం ఒక విశిష్టమైన కథ. మాత అనగా తల్లి ఆదిశక్తి పరంజ్యోతి అని ఈ మహత్తర శక్తికి గల పేరు. భవాని, అంబ, కాళిక మొదలగు మాటలతో ఈ శక్తిని ఆరాధించే సంప్రదాయం ఆంధ్రదేశంలో ఉంది. బైండ్లవారు ఈ శక్తిని బాధలు మాన్పే దేవతగా భావించి ఆమె కీర్తిని తమ ప్రధాన వాద్యమైన జమిడికతో పాడుతూ కథను ప్రారంభిస్తారు. బవనీయుడు రేణుక అమ్మవారి కొలుపులకు ప్రధాన పాత్ర. వంకలోని జమిడికతో అతడు శక్తి గానం చేసినచో ఆది శక్తికి ఎనికియే లేదు.

...లైన రుంజ, మృదంగం, తబలా, డోలు, మద్దెల, డమరుక, వీటన్నిటికి లేని లక్షణం జమిడికకు ఉంది. ఒక తంత్రి, ఒక చర్మం రెండు కలిసి ఉన్న వాద్యం జమిడిక. ఇది భారతీయ వాద్యాలలోనే ప్రత్యేకతను కలిగి ఉంది. దీనిని వాయిస్తూ అమ్మవారిని సంతోషపెట్టే విధంగా జానపదులను అలరించజేసిన ప్రార్థన గమనిద్దాం

తల్లి నిన్ను కొలచి దండములు పెట్టి
కరమెత్తి మొక్కెదా, నా కన్నతల్లి
ఆపనికోపల జనుల అంబవే తల్లి
బవనీల పాలిటి ఓ కన్నతల్లి
గవ్వ దర్శనాలు, ఘనముగా ధరియించి
మువ్పొద్దు పూజలు చేసేము తల్లి
గుగ్గిలము మైసూచి కుప్పగా పొగలేపి
తలచితిమి మదిలోన తల్లి మాయమ్మ
సుతులు, జమిడికల, సుందరముగా వాయించి
కాళ్ళ గజ్జెలు కట్టి ఘల్లున మోగించి
ఆడితి స్నీముందు అంబవో తల్లి
ఇల్లిల్లు నీ పూజ ఇష్టముగా జేసి
జగన్మాత నిన్ను జగమెల్ల గొలిచెదరు
కోపగించకు తల్లి ఓపజాలమమ్మా
బిగ్గ బగ్గున మండి బొబ్బలు లేపి
కష్టపెట్టకు మమ్ము ఓ కన్నతల్లి

కొత్త కుండల కల్లు సాకాలం నాకు
గడప గడపకునాకు కలివేపరిల్లు
ఆపదలు బాపేటి అమ్మలకు అమ్మ
శాంతింపు మా తల్లి జగమేలే తల్లి
కోపగించెడి వేళ కోడి పుంజులు బలి బలి
గొర్రెపోతులు బలి బలి
శాంతింపు శాంతింపు ఓ జగన్మాత
బవనీల ఇంవేల్పు భార్గవి అంబ
దండములు దండములు చండికా నీకు

అని ప్రధాన బవనీయుడు జమిడకను వాయిస్తూ, శక్తి రసావేశంలో ఊగిపోతూ పాడు తుండగా వంతగాళ్ళు అనుసరిస్తారు. ఇలా గేయం పాడుతూ ముగింపులో బవనీల ప్రార్థన ఆలకించెడి తల్లి అని తనను గురించి కూడా ప్రస్తావించు కోవడం కనిపిస్తుంది. ఇంకా వీరు దేవతాస్తుతిలో శక్తి కథా గేయాన్ని ద్విపదకు సమీప గతిలో నడుపుతుంటారు. ఉదాహరణకు —

రేణుక శక్తి కల్యాణంలో —

రాతికే పరమియ్యి మాత
నీ అష్ట కంకాణాల చేత
అవ్వనమ్మ అనంటట్ల కొమ్మ
నీవు అద్దంకి నాంచారి వమ్మా
కల్లు తాగుదువు రావమ్మో
సారాయి తాగుదువు లేవమ్మా
గంజాయి తాగుదువు రావమ్మా
అల్లా నాడునీ విచ్చిన వరము
అడితప్పకే ఓయమ్మా
బండ్లు కట్టుక వచ్చేవారు
పూల చెండ్లు వేసుక వచ్చేవారు.
గుడిచుట్టు కుంకుమ బండ్లు
నీ మెడచుట్టు బంగారు గుండ్లు
అమ్మ అందురే నీ పేరు
శివ అవతార మందురే నీ పేరు

ఈ జన్మ ప్రవృత్తులన్నింటిను తెలిపే మరో పాట రాగ యుక్తంగా శ్రేడి పాడడం వినబడుతుంది...

శ్రీశైలవు శిఖరాన బిడ్డవమ్మా ఎల్లమ్మా
నీవు శివనల్లి మాతవమ్మా ఎల్లమ్మా
పార్వద్దేవి బిడ్డవమ్మా ఎల్లమ్మా
నీవు పరంజోతి తల్లివమ్మా ఎల్లమ్మా
పుట్టలోన బుట్టినావు ఎల్లమ్మా
నీవు పుడమిపై బిడ్డవమ్మా ఎల్లమ్మా
నాగవల్లి చీరలమ్మ ఎల్లమ్మా
నీకు నెమలి కండ్ల రవికెలమ్మా ఎల్లమ్మా
ఏదుము గవ్వాలు తల్లీ ఎల్లమ్మా
నీకు వెనుకదరిసెనమ్మా ఎల్లమ్మా
నాగుపాముల బట్టినావు ఎల్లమ్మా
నీవు నడికట్టు వేసినావు ఎల్లమ్మా
జెర్రిపోతుల బట్టినావు ఎల్లమ్మా
నీవు జడకొప్పులు వేసినావు ఎల్లమ్మా

ఓరుగంటి రాజులను ఎల్లమ్మా
నీవు ఓంకార మడిగితివి ఎల్లమ్మా
నీవు ఎవరైనచో తల్లి ఎవరమ్మా ఎల్లమ్మా

అంటూ తల్లిని బవనీడు కీర్తిస్తాడు.

మరొక ప్రార్థనలో ఎల్లమ్మ కథను అబ కీర్తనతో మొదలు పెడతాడు.

కృతయుగంబున రేణుకా శక్తి
త్రేతా యుగంబున సీతా మహాశక్తి
ద్వాపర యుగంబున ద్రౌపది మహాశక్తి
కలియుగంబున అమ్మవారు
గృహా గృహిణి యను ఆదిశక్తి
లోలాక్షి లోకమాత
మాపు చూస్తే మరియొ రూపు
పగలు చూస్తే పద్మిని రూపు

లోకాలు నేలశక్తి
లోకాలు పోలశక్తి
నీళ్ళమీది బుగ్గ నీ లారివమ్మా, అమ్మా
అమ్మవారు నీ గురిగింజ కన్నులకు—
—గుప్పెనసుదుట

వాలారి కన్నులకు వచ్చెట్లు దురమబవనీల ప్రార్థనను ఆలకించి మమ్ములను కాపాడినట్టి రేణుకా పరంజ్యోతి, ఆదిశక్తి, అమ్మవారు నమస్తే నమస్తే నమః అని ఆదిశక్తిని కీర్తిగానం చేస్తారు.

**భారత భాండ్రు**

శైవ, వైష్ణవ, శాక్తేయాది కథలను చెప్పుతూ అన్ని కులాలను ఆశ్రయించి జీవిస్తారు.

**పిచ్చకుంట్లవారు**

గంట, తిత్తి వాద్యాలతో పోషక కులాల వారు బిరుదులు పఠిస్తూ తెలంగాణంలో పర్వతాల మల్లారెడ్డి, సూర్యచంద్రరాజుల, హరిశ్చంద్ర, లక్ష్మమ్మ, కామమ్మ, బాలనాగమ్మ, సోమనాద్రి, సదాశివరెడ్డి, మొదలైన గాథః వీరు పాడుతారు.

**బీరన్నలు ఒగ్గుకథకులు**

మల్లికార్జునుని కథ, సాంబని కథ, వీరభద్రుని కథ, ఎల్లమ్మ కథ, పరశురాముని కథ. ఒగ్గు వాయిద్యం మరో ప్రక్క పెద్దపెద్ద తాళాలు వాయిస్తూ ఆకర్షణీయంగా కథలు చెపుతూ జీవనం గడుపుతారు.

**దక్కలివారు**

కిర్మురమీర పండగ సాయన్న కథ మొదలైన చారిత్రకాలు వివరిస్తారు.

**పాండవులవారు**

పాండవుల కథలు, భారత సంబంధి కథలు చెపుతారు.

**దాసర్లు**

వీధి భాగోతాలు ఆ యక్షగాన పక్కిలో ఆడుతూ జీవనం గడుపుతారు.

**చెంచులు**

గరుడా చలం యక్షగాన రూపంలో పాడుతూ ఆడుతూ జీవిస్తారు.

**మాషీలు చిందులవాళ్ళు**

అన్నిరకాల.

ఇతి వృత్తాలను గ్రహించి వీధి భాగోతాలుగా ప్రదర్శిస్తారు. ఈ రకంగా భిక్షుకగాయకులు జీవనం సాగిస్తున్నారు

కాని జానపదులలో బవనీడు శక్తి గాయకుడుగా, పౌరాణిక కాలం నుంచి అనగా ఆదిశక్తి ఆవిర్భావ కాలం నుంచి జమిడికను వాయిస్తూ శక్త్యారాధకుడుగా పూజారిగా, మంత్ర తంత్ర ప్రయోక్తగా, పాడే పాటలతో, పద్యాలతో, దండకాలతో, ప్రజలకు వినోదాన్ని భక్తిని కలిగిస్తాడు. ఏ కథ చెప్పిన ఎల్లమ్మ దేవతను పొగుడుతూ ఒకే తీరుగా కథను నడుపుతాడు. మిగతా భిక్షకగాయకులకు ఇన్ని రకాల వృత్తులు లేకపోవడం గమనార్హం. వీరు అన్ని కులాలనుఆశ్రయించి గ్రామ జాతరలు, ఊరబోనాలు, మొదలైనవిచేస్తూ అందరి తలలో నాలుక మాదిరిగా జీవయాత్ర సాగిస్తాడు.

శ్రీనాథుని వంటి కవుల చేత కావ్యాల్లో కీర్తింపబడి జానపద విజ్ఞాన వికాసానికి దోహదం చేస్తున్న వారు బవనీలు.

# కవితావీథి

## రా వు ఖా ణా వు

### సప్తమ సర్గము

— ఊట్ల కొండయ్య

చరణముల క్రింద నుంచె నా చర్మకారు
డడుగుదోయి పయింబెట్టెనంబరస్పృశు
దాహాతాచ్చర్య విచలితుడైన మౌని
వసన పదరక్ష లిరుకేల బట్టి పలికె

ఇందబ్యాబ్బ్యాన మీ కరాంగుళులు
ముద్రించెన్ మనోభావనా సౌందర్యమ్ము
నశేషచారు సృజనస్వాంతమ్ము
సచ్చింతనా సందోహమ్ము
ననన్య శీలము,
ప్రశంసాయోగ్య సేవావ్రతం బెందున్
మీ సరివారి కానము
స్వకీయేధా పరిత్యాగులన్.

ఈ జగన్నాటకమ్మున నిట్టి గ్రామ
రంగముల నటించెదరు పాత్రలు మనుష్యు
లయ్యయి తె రంగు కర్మల ననుసరించి
సర్వుల సుఖార్థ ముచ్చ నీచమ్ములనక.

జరుగు నీ మరియాద యిజ్జనపదమ్మున
నం దవిచ్ఛిన్న మవిభాజ్యమగుచు, సర్వ
సమ్మతమ్ముగ ననెదు నాశంసజేతు
ననగ జన పదాగ్రణి పల్కె మునికిమ్రొక్కి.

మహితాత్మ యఖిలవృత్తులు
వహింతు వా రొక్క తల్లివారలవలె ధూ
ర్వహులయి గ్రా మశుభము ని
ర్వహింతు రిదె మాయ జేయ బలమగు తంత్రి!

అరుగో, అచనుదెంచు నిర్వర,
కరమ్మం
దొక్క తాబేటీకా
యు రహింపన్ చను దెంచువాడు
ఘట కర్మాచారు! దా సూరెలం దరుదెంచున్
చెయి దండముల్ల సిల చార్వాది
క్రియాచారి, మా తరమా
నీ మహిమ మ్మెరుంగ
జన మూత్సాహించు నిన్ జూడగన్ 6

కాటూరి కవితాపీఠం, మాధవి ప్రింటర్స్, కుల్బిగూడ, హైదరాబాదు–27.

అనెడు నర్థోక్తి నిర్వురు నరుగుదెంచి
పడిరి సాష్టాంగమట సమర్పణముజేసి
కూర్మఘటదండములు, వారి కూర్మినెత్తి
మోము వికసింప నిట్లనె మునివరుండు 7

ఎట్టి కర్మ కౌశల్యము చెట్టబట్టె
మిమ్ము; సౌభాగ్యమింతకు మించివలయు
నేమి? ప్రచ్ఛన్న యోగులు గ్రామకర్మ
కారు, వీరందగించు మీకతన బ్రతుకు 8

సుందరపరికరములు నా
నందము వర్థిల్ల, శ్రమమణగు కర్మల, పెం
పొందు మనికి నాకర్షణ
మందుకె శివసుందరమని యందురు బ్రదుకున్ 9

శివమనకున్ విదూరమయి చేద్పడు
సుందర మెంతయేనియున్
శవమది సేమమున్ తలగి
సత్యమెతత్స్వరూప
మ్మెల్లదు నిక్కువము వసింప
దాసొబగు కూలు తనంతన,
నంతరంగమం దవహితమౌ
నసత్యమను నగ్ని నశించు జగమ్ములజ్జిలన్ 10

ఇటపంచరించెడి తల్లికెక్కువయయి
యూడిగము మీకు సల్పు నరోత్తముండు
ధావకుడు కాను పింప దతండు కలడొ
లేడొయన, గ్రామణియును తోడ్తోనబలికె 11

ఖ్లమ వెనుక చక్కి యున్న యాతండె యాత
డని నుడువుచుండ రజకు డమ్ముని పదముల
వ్రాలి చుంబించె, చూచు సర్వప్రజయును
సంభ్రమాశ్చర్యములు వాని సన్నుతింప 12

మునియును తత్క్షణమ్మున
విమోహితుడై రజకున్ కవుంగిలించెను
కరమెత్తి యాసుకృతి శీర్షముపై
నిది స్వస్తి పల్కె, పల్కెను
పరికింపుచున్ జనుల కించని కొంచక
నీచ వృత్తి నే జనుడు
వహించు నాతనికి చాలడు
దేవుడు తూచి చూచినన్. 18

మనుజ సంఘంబు లేర్పడి మనెడునప్పు
డేక వంశస్థులందె నెనేక వృత్తు
లనుసరించి రందరకు సౌఖ్యమ్మునెంచి
రాప్రియమ్ములు నిటగల్గననితలంచు 14

అన ముని జనపదముఖ్యుం
డనె, పంటలు పంచికొందుమటులే సమస్త
మ్మును ననుభవింతుమవిబా
లనియెడ దెత్తుము ఋణమ్ములయ్యయియెడలన్ 15

పెండిళుల పేరటములన్
పండువులన్ జనన మృత్యు వర్తనములయం
దుఃఖదము దుఃఖ సుఖములం
నెండల వానల నొకటిగ నెంచి తడియుచున్ 16

తక్కువలెక్కువలను నవి
యొక్కటి మా యెడల కాన మూరన్, మాకం
టెక్కడిది? సహోదరులం
దక్కట యూహింపరాని దది మా యందున్. 17

అనవిని మౌని హ్లాదిమయుడై
కరుణార్ద్ర విలోకనమ్ములన్
కవిజనులన్ వచించెనిటు
కన్నుల వీనుల మీ శుభ
ప్రవర్తనములు జొచ్చి లోని
శివ తంత్రులనిక్వణముల
చెలంగె నేమని కొనియాడుదున్ మిము
ననంతసు ధామధుర ప్రవృత్తులన్ 18

అదె కనుదర్శ్యమ్ము లరుణమై
ముఖమ్మాగ్రహమున్ వహించి యుం
బుదములయాగడమ్ము
తలపోయుచు, న స్తగిరిన్ మహోగ్ర
కోపదవమునన్ దహించు
నను భ్రాంతి యెసంగెడి
పేరుడింక మీ సదనములందు
పాకములు సల్పగ బోనము లారగింపగన్ 19

రేలభుజింపనోప మరరీకృత
మియ్యది మీకు మాకు
నియ్యాలన రిత్తబుచ్చి
మమున్నల్లరి బెట్టుచుందంతె చాలు
పాదాలకు నింద దిక్కు
చనుదారులు చూపుడు, లెండు పోవ, ని
ర్భాలురు గేహినుల్ తదయవచ్చునె
వృద్ధులతోడనిందులన్ 20

జానపదుల్ మునీశ్వరువచస్సుల
నాజ్ఞలుగన్ గ్రహించి పోబూనగ
నందు వార్ధక విభూషణు
డొక్కడు మౌని డాసి, యజ్ఞాను

నసున్ క్షమింపదగు స్వామి!
ఫలమ్ములు పాలునెట్లగున్
బోనము? పండ్లు కానలను
బుట్టెడి, గోరసమాయె క్షీరమున్ 21

మీకు వచించునాసమెము
మేరలు మీరుట కాదు కాని
తండ్రీ! కనుగొందునో
మరల నింతకె కాలము తీరిపోవునో
నాకను శంక వేదెదమునఃప్రియ
మొప్పు కృపాకరుండవై
నాకమనుగ్రహింపగదె
నాకయి చేకొని పాలుపండులన్ 22

అన నాజరుండు, నవ్వుచు
ముని వరు దప్సరసల నాకమున్ వలచితివే
యనగన్, పక పకమని యా
జన సందోహమునసవ్వెసగె దీర్ఘమ్మై 23

మంచిది నీయభి మతమున్
వంచింపగనేల? కుడిచి వచ్చుతరిన్ పా
లించుము నీనుడి, నేసే
వించెద సుమి నీకునాక వేశనమునకై 24

వెంకియు మునీంద్రు డిట్లను
చుండన్ మరలుచును నవ్వుచున్ వక్కానవా
రందజముల క్రియ లఘువగు
చుండన్ జీవనభరమ్ము చొచ్చిరి గృహముల్ 25

అట్లు శాలురు వృద్ధు లంగనల్ చన, శేష
జనపరివేష్టిత సత్త్వమూర్తి
శుచియయి యవ్వారివచనంబు గైకొని
పద్మాసనమున నుపస్థితుడయి
యొక కొంతతరి ధ్యానయోగసమాధి సం
స్థితుడై నగమ్ములచేత సంవృ
తమ్మైన హిమనగేంద్రమ్ము కైవడితోచె
నా శైలరాజ ముఖారవింద
మర్కతేజఃప్రసరణమునంది వెలుగు
ఛంగి నమ్మునిఫాలమ్ము పైని కాంతి
వెల్లివిరిసి తమపయి పర్విడ సదస్యు
లద్భుతానందపారవశ్యాత్ములైరి 26

అంతవారలరిగి యాలయముల కింత
యారగించి మరలిరటకు నంద,
రా ముదుకడొసంగి నట్టివిను యానెము
నీశు డెల్ల వారి హితవు నెంచి 27

# హద్దులు

పుట్టపర్తి నాగపద్మిని

తాతయ్య బోసి నోటి దరహాస చంద్రికలా
తల పండిన అమ్మమ్మ నుదుటి
ఉదయ భాను కాంతిలా
ఒక్కసారి తనను పలకరిస్తే చాలు
పదివేల మంచిగంధపు సీసాలు
స్ప్రే చేసుకున్న అనుభవం
మండు వేసవిలో
మల్లెతావౌతుంది దేహం
వసంత కాలపు కోకిలవుతుంది హృదయం...
ఆ కోకిల గొంతుతో
అందంగా సాగే రాగవాహి నవుతుంది నా గది
ఒక్కసారి పలుకరిస్తే చాలు
ఆ చిన్ని ప్లాస్టిక్ గదుల ద్వారాలు తెరుచుకొని
కోటి స్వర్గాలు నా మీదికి దూకుతాయి.
మమ్మల్నెలా మరిచిపోయావంటూ
బేల మొహం వేసి ప్రశ్నిస్తాయ్....

అవును
ఆ రోజుల తీరే వేరు
కేరళలో పనిచేసే అత్తయ్యా కడుపు వంటల
మాటల్లో
తేనెలూరే మలయాళ వనసతౌనల తీయదనాలూ
విశాఖ నేవీలో మెరైన్ యింజనీర్ మామయ్య
చిన్నారుల
కోస్తా పూతరేకుల సోయగాలూ
మాతో పాటూ భాగ్యనగరం నుంచి తరలివచ్చిన
కలాఖండ్ పసితనాలూ
కాశ్మీర్ ఆర్మీ ఆఫీసర్ చినతాతయ్య తో
అక్కణ్ణించి విచ్చేసిన
డోంగ్రీ అక్రూట్ల మెత్తదనాలూ
అన్నీ కలగలసి,
యెక్కడో ఆంధ్ర మారుమూల పల్లె ఒడిలో
సమతా గీతం పాడేవి.
అవి ఒక్కోసారి హోలీ రంగులైపోయేవి.
మరోసారి సంక్రాంతి గొబ్బెమ్మలై
బంతిపూలను సింగారించుకొని కులుకుతూ
మురిసేవి
ఇంకోసారి దీపావళి టపాకాయలై
నవ్వుల వెన్నెల లైపోయేవి...
అంతెత్తు పాతకాలం కోటలాంటి ఇల్లుదాటి
ఆకాశంలోకి ఎగిరిపోయి
పతంగాల సరదాలై పోయేవి....

24–88/6, ఆనంద్‌బాగ్, మల్కాజిగిరి, హైదరాబాదు–47.

అప్పటికింకా పెళ్ళికాని పిన్ని,
మమ్మల్ని రాత్రిళ్లు నిద్రపోనీకుండా కూలేసి
హారర్ రాక్షసుడి కొండపీటి చాంతాటంతటి
కథం
అల్లికతో పనితనం చూపేది
అకథల చాంతాడుతో వేసవికాలం దిగుడుబావుల్లో
నీళ్ళు తోడదాం రమ్మని ఉడికించే
పక్కింటి కాలేజీ కుర్రాడు రాంబాబు
పెరట్లోని గోరింట చెట్టు
మా అరచేతుల్లో నెలవంక పద్మం
సూర్యుడు నక్షత్రాలుగా మారిపోయి
అమ్మమ్మ వెన్నెల వేళల్లో
అరుబెట మా అరచేతుల్లో పెట్టే
పెరుగన్నం ముద్దలను రుచిరుచిగా మెక్కేది
తన ఫోటోల పిచ్చితో
మమ్మల్ని ఆ ప్లాస్టిక్ గదుల్లో
బొమ్మలుగా చేసి బంధించి
తన ప్రావీణ్యానికి తెగ మురిసిపోయే
చిన మామయ్య ఆ పిచ్చితోనే
కెమెరా చంకనేసుకుని
మోటార్ సైకిల్ పై అఘమేఘాల మీద
పట్నానికి పరుగులు పెడుతూ,
అదే పట్నం నుంచీ చక్రాలపైన వస్తున్న
లారీ పుణ్యాన
ముప్పై సంవత్సరాలకే
ఫోటో ఫ్రేమ్‌లోకి వెళ్ళిపోయాడు పాపం....
ఆ దుఃఖ భారంతో
కూడ బలుక్కుని

ఒకరి తరువాత ఒకరుగా
మామయ్యను వెతుక్కుంటూ
ఆకాశంలో అంతర్ధానమైపోయారు—
అమ్మమ్మా—తాతయ్యలు
అటు తరువాత
గోరింకలూ—చిలుకలూ
కోకిలలూ—పిచ్చుకలూ అన్నీ
ఎక్కడివక్కడే ఎగిరిపోయాయి
వున్నచోటు నుంచి కదలని
మూల విగ్రహాలైపోయాయి—అప్యాయతలు
అష్టదిక్పాలకుల డ్యూటీ చేస్తున్నట్టు
పనిచేసే చోటే అంటిపెట్టుకుపోయాయి
—బాంధవ్యాలు

దేశానికి సరిహద్దుల్లా
ప్రతి కుటుంబానికీ
ఆఖరికి ప్రతిమనసుకీ సరిహద్దులుంటాయని
ఆ తరువాతే తెలిసింది
ఉత్తరం—దక్షిణం
తూర్పు—పడమరలు
మారుమూల పల్లెటూరిమాట మర్చిపోయి
ప్రపంచపటంలోలా
జిగురు అంటించుకుని
అక్కడే అతుక్కుపోయాయి
మళ్ళీ అవి కలిసే అవకాశం లేదా?
పలు భాషల సమాగమంతో
పరిమళించే సారస్వతమాలతా
పలుమనసుల సహజీవన సౌందర్యంతో
అందగించే అవకాశం అవనికి రాదా!
ఇక రాదామరి?

# దివ్య జ్వాలనం

డా॥ పోతుకూచి సాంబశివరావు

ఆడదానికి ఆకర్షణ వుందని పొగరు
పురుషుడికి ఆధిక్యతవుందని గర్వం
అందం, సోయగం, అతివకు ప్రత్యేకత
బలం, హాలం, పురుషుని విశిష్టత
ఆడదానిపై అత్యాచారం చేసే పురుషుడు
ఆకర్షణవల్ల తరుణి అత్యాచారానికి గురౌతాడు
మేధస్సు విషయంలో స్త్రీ పురుషులు
ఒకరి కొకరు తీసిపోరు.
విడివడిన లింగభేదం
బలా బలాల ప్రదర్శనకు కాదు
జగన్నాటకంలో కార్యకారణ క్రియ
అనంత ప్రేమసృష్టికి ఆలంబనం
ఆ పరమాత్మ ఆలోచనల
ప్రతిబింబాలు స్త్రీ పురుషులు
ఆ ప్రతిబింబాల వెలుగులు
స్త్రీ పురుషుల ఆత్మలు
అవి ఏకమై ఐక్యమై ఒకటైతే
అదొక అనంత తేజః పుంజం
కాంతులు ప్రసరించు జగద్రక్ష దివ్యజ్వాలనం

---

6-3-195, న్యూ బోయిగూడ, సికింద్రాబాద్-500 003.

# గుండెల గోతాల్లోకి....

గన్ను కృష్ణమూర్తి

తన గడ్డి పరకల బాకుల్ని
వెన్నెట్లో పదును బెట్టు కుంటోంది
తోట!
తమగుండెల గోతాల్లోకి
చల్ల దనాన్ని
నింపుకుంటున్నాయి
పూలు!
మౌనముద్రలో మునిగిన
యోగుల్లా
ఒంటి కాలి తపస్సు
చేస్తున్నాయి
వృక్షాలు!
పుటలు పుటలుగా
నవ్వే పుస్తకంలా
చిరునవ్వులు
చిందిస్తోంది
వెన్నెల!

లెక్చరర్, బీడీ హస్పిటల్ కాంపౌండ్, సిద్ధిపేట్–502 103.

# మందార మాల

## గుణనిధి పాత్ర తత్త్వం శ్రీనాథుని ఆవిష్కరణం

మానవుల చతుర్విధ పురుషార్థాల్లో చివరిది మోక్షం దీన్ని పొందడం రెండు విధాలుగా కనబడుతుంది.

1) సాత్విక ప్రవర్తనతో భక్తిని ప్రకటించి మోక్షం పొందడం.

2) జీవితాంతం దుర్మార్గంగా ప్రవర్తించి మరణ సమయంలో నరక యాతనలు అనుభవించకుండ మోక్షం పొందడం. రెండో పద్ధతిలో నడిచి, సాంఘిక జీవితాన్ని పరోక్షంగా సాహిత్యంలో ప్రతిఫలింప చేసేవి గుణనిధిలాంటి పాత్రలు.

మానవుణ్ణి రక్షించే చరమ శక్తి దైవం. అంతకు ముందు మౌలికంగా మానవ ప్రయత్న ముండటం తప్పని సరి, కాని దుర్మార్గుడు, దుష్ట వర్తనుడు అయిన వ్యక్తిని దైవం రక్షించిన సంఘ టనలు, చివరిదశలో దైవం ఒడిలోకి విచిత్రంగా చేరి ముక్తిని పొంది. ఆ క్షేత్ర, దైవ మహాత్మ్యాలను ప్రకటించడం. ఇలాంటి పాత్రల ప్రత్యేకత. అవి సాహిత్యంలో ప్రతిఫలించిన విధానాన్ని పఠితలపై ప్రభావం చూపిన వైఖరిని కింద విధంగా వివరించవచ్చు.

ఒక కావ్యాన్ని చదివినప్పుడు లేదా ఒక రూపకాన్ని దర్శించినప్పుడు కొన్ని ప్రత్యేక లక్షణాలచేత అందులోని కొన్ని పాత్రలు మనల్ని ఆకట్టుకుంటాయి. జీవితాంతం తాను ఆచరించ కూడని మార్గాన్ని అనుగమించినా అతడు ముక్తిని పొందడమే ఇలాంటి పాత్రల ప్రత్యేకత. అలాంటి వాటిలో గుణనిధి పాత్ర ఒకటి.

అయితే నిర్గుణోపాసన సాధ్యం కాని సన్ని వేశంలో బుద్బుద ప్రాయమై, నశించే ఈశరీరంతో ఏం చేసినా తప్పు లేదని భావించి. ఇలాంటి మార్గంలో ప్రవర్తించే వారికి భగవంతుడు మోక్షం ఇస్తాడని చాటి చెప్పడానికి. ఇది ఉపయోగిస్తుంది.

ఎంతో నిష్ఠగా ప్రవర్తించవలసిన వారుకూడా వ్యక్తిత్వాన్ని ఎలా కోల్పోతున్నారో, తమ అస్తి త్వానికి ఎలాముప్పుతెచ్చు కుంటున్నారో, చెప్పుతోంది

సమాజ ప్రభావంచేత తమ మనో నిబ్బ రాన్ని ఎలా కోల్పోతున్నారో చెప్పడానికి, సమాజ పరిస్థితి ప్రతి వ్యక్తినీ స్పందింప చేస్తుంది కాబట్టి అరిషడ్వర్గాలను అదుపులో ఉంచుకోవాలని హెచ్చ రించేడానికి మనోధైర్యం ఉన్నా అరిషడ్వర్గాల్ని అదుపులో ఉంచుకోలేనివారు ఎలా పతనమౌతు న్నారో చెప్పడానికి, పరోక్షంగా ముఖ్యంగా క్షేత్ర దైవ మహాత్మ్యాలను ప్రకటించడానికి ఇలాంటి పాత్రలు ప్రభవించి ఉంటాయి

కాంపిల్య పురంలోని యజ్ఞదత్తుని కుమారుడు గుణనిధి. చిన్నతనంనుంచి వ్యసనాలకు బాని సయ్యాడు. తల్లి ఎంత చెప్పినా పట్టించుకునే వాడు

కానీ, తండ్రి కాలాంతరాల్లో నిమగ్నుడు కావడం చేత కొడుకు గురించి పట్టించుకొనే వాడు కాదు. పుత్రుని ప్రవర్తనను తల్లి తండ్రికి తెలియనిచ్చేది కాదు.

ఒకరోజు యజ్ఞదత్తుడు తనకు రాజుగారు ఇచ్చిన ఉంగరం జూదరి వేలికి చూడడం, కొడుకు ప్రవర్తన తెలిసికొని, అతనిగురించి చెప్పక దాచిన భార్యను నిందించి కుపుత్రత్వం కంటే పుత్రుడు లేకపోవడమే మేలని తలచి, గుణనిధికి తర్పణం వదిలాడు.

అంతకుముందే తండ్రికి తనమీద కోపం కలిగిందని తెలుసుకున్న గుణనిధి ఇంటికి వెళ్ళక గతం గురించి చింతించి పశ్చాత్తాప పడ్డాడు. ఆదరించే వాడు లేక క్షుద్బాధ అధికమైంది. ఆరోజు శివరాత్రి పర్వదినం కావడంతో శివుడికి నైవేద్యం కోసం తీసుకు వెళుతున్న పక్వాహారాలను ఏదో విధంగా ఆరగించాలని వెళ్ళాడు. తెల్లవార్లూ జాగారం చేసి. భక్తులు నిద్రించిన సమయంలో పక్వాన్నపాత్రలు పట్టుకపోతున్న అతని కాలు నిద్రపోతున్న భక్తునికి తగిలి దొంగ! దొంగ!! అని అరవగా తలారులు ఆలయ ప్రాంగణంలోనే బాణాలు వేసి గుణనిధిని చంపేశారు.

అతన్ని తీసు కెళ్ళడానికి శివదూతలు. యమభటులు వచ్చారు. అయితే శివదూతలు—శివరాత్రినాడు అన్నమైనా తినక ఉపవాసంతో జాగారం చేసి, దీపాన్ని వెలిగించి, శివుణ్ణి దర్శించి, దేవాలయ ప్రాంగణంలో మరణించాడు-అంచేత శివలోకానికి అర్హుడని చెప్పి తీసుకుపోయారు.

మనిషి మనస్సు ఒక అమూర్తమైన తేజస్సు. ప్రతి మనిషీ తను చిత్తశుద్ధితో ఏదైనా పనిని ప్రారంభించినప్పుడు దాన్ని మనసా, వాచా, కర్మణా చేస్తున్నట్లు తనకు తాను అంతర్గత (ఆత్మ) ప్రబోధం చేసుకోవాలి. అప్పుడు అది మనస్సులో అంకురించి, వాచారూపంగా పుష్పించి, కర్మ (పని) రూపంలో ఫలిస్తుంది. ఇక్కడ మనకు మూడు దశలు కనబడతాయి. ఇలా భావించడం ఏ కార్యానికైనా స్థిర చిత్తంతో చేసే ఉత్తమ పురుషుని లక్షణం. దైవారాధనవిషయంలో ఈ అంశం తిరగబడి కనబడుతుంది.

'కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనావా ప్రకృతే స్వభావాత్
కరోమి యద్యత్సకలం పరస్మై
శ్రీ నారాయణాయేతి సమర్పయామి'.

నేను నా ప్రకృతి ననుసరించి కాయము, వాక్కుల మనస్సులతో కాని; కర్మేంద్రియ, జ్ఞానేంద్రియాలతో కాని; బుద్ధితో, అంతరాత్మతో కాని ఏంచేసినా అదల్లా ఆ శ్రీమన్నారాయణ మూర్తికే అర్పణం చేస్తున్నానని శ్లోకభావం.

మనం భగవంతుని మనో దర్పణంలో ప్రతిఫలింప చేసుకోవాలి అంటే, చరమ (తృతీయ)మైన ఆస్థానాన్ని సఫలీకృతం చేసుకోవాలి. అంటే అంతకుముందు కర్మ, ద్వారా సాధించాలి. యోగాభ్యాసం, సంధ్యావందనం, తపస్సు మొదలైన కర్మలను ప్రారంభించాలి. 'కర్మ' అనబడే దృగ్గోచర రూపం నుంచి పరిణమించి, 'వాచమనే' శ్రవణ గోచర రూపానికి, దానినుంచి తదేక భావా రూపమైన మంత్ర ధ్యానం చేత ఆమూర్తం అవయవ రహితం అయిన మనస్సు వైపుకు పరిణామ క్రమంలో పయనింప చేసి సిద్ధిని పొందాలి.

అయితే ప్రతిరోజూ ప్రతిమనిషి ఆచరించే కర్మ అన్నింటినీ ఇలా పరిణామ క్రమంలో రూపొందించబడు, కొన్ని నైమిత్తికాలు, కొన్ని భౌతికావసరాలు కావడమే ఇందుకు నిదర్శనం. ఇలాంటి భౌతికాపేక్షకాలైన కర్మలన్నీ వాచా, మనసా రూపాలు పొందక కేవలం కర్మ రూపంలోనే ప్రభవించి అంతమొందుతాయి. ఏదైతే తనకు ఉత్కృష్టతను, ఔన్నత్యాన్ని కలిగిస్తుందో—దాన్నే తరువాతి సోపానాలకు అధిరోహింప చేస్తాడు. అదేవిధంగా ప్రత్యేక పాత్రలన్నీ తాము లొంగిపోయిన వ్యసనాలన్నీ వారి భౌతికమైన అవసరాలకేనని భావించి ఉండవచ్చు. అందుచేత వారు చేసే పనులన్నీ కర్మరూపంలో ఉద్భవించి ఆ రూపంతోనే అంతరిస్తాయి. అంతకంటే వాటి అవసరం కూడా లేదు. అయితే అతనికి ఏ సమ్మోహార్తానో దైవానికి సంబంధించిన కర్మ జ్ఞప్తికి వస్తుంది. దాన్ని అతడు 'వాచా' రూపంలో అనుసరించి, 'మనస్సు'తో ఆచరిస్తాడు. మనసు లగ్నంచేత మౌలికంగా మనిషి సాధించే బుద్ధి తత్వాన్ని, భగవద్దర్శనాన్ని, కైవల్యాన్ని పొందుతాడు.

ఇదే విషయాన్ని ఓచోట శ్రీనాథుడు (కాశీఖండం–4వ ఆశ్వాసం–110 పద్యం) ఇలా వివరిస్తాడు.

''గుణనిధి తండ్రి కోపంబెఱింగి యింటికిం బోవక యెందేనియు, జనువాడనని మనంబున నిట్లని వితర్కించె''

''ఏమి సేయుదు? నెక్కడి కేగువాడ?
ధనము నిప్పచ్చరంబు విద్యయు దుశక్తి
పెట్ట సాగెదు నాచేయి భిక్షసేయ
నట్టు తెరుచు? దైవంబు యెఱుగు నింక

అని దైవమే తనకు మార్గం చూపాలని మనస్సులో అనుకుంటాడు. హృదయానికి మొదటి సారిగా కలిగిన స్పందన తల్లి అన్నం పెట్టడం గురించి మొదటి సారిగ అతని మనో చిత్తవృత్తి భౌతికావసరమైన ఆకలిని గుర్తించి పట్టించుకుంది. తదన్వేషణ కోసం బయలుదేరాడు. అక్కడ నుంచి అతను చేసే 'కర్మను' మనసుతో ఆలోచిస్తున్నాడన్నమాట; అతడు తన తల్లి చేసిన సేవలు తలంచుకొని, తనకు ఇంకెవరు చేస్తారని కుమిలిపోతాడు. ఇక్కడ గుణనిధి మెదడుకు పదను పెట్టాడు. గతించిన అనుభవాలను మనస్సుతో నెమరేసుకుంటున్నాడు, అతనికి ఆ రోజు భయంకరమైన ఆకలి వేసింది. అది నిజమైన ఆకలి కాదు. ముగిసిపోతున్న తన జీవిత చరమాంకంలో కనీసం ఒక్కసారైనా భగవంతుని తనివి తీరా మనో నేత్రంతో దర్శించాలనే క్షుద్బాధ.

అందుకే శ్రీనాథుడు 'బ్రహ్మాండ మండలాన్ని ఆచ్ఛాదించిన అంధకారంలో చుక్కలు పొడిచా' యని అంటాడు. ఇక్కడ అంధకారం బ్రహ్మాండాన్ని ఆవరించలేదు. గుణనిధి మనస్సులో వెలుగు రూపంలో అవతరిస్తున్న వెలుతురు చుక్కలు అక్కడి భవనాలో వచ్చిన వెలుతురును 'భవిష్యద్వాసర కరో ప్రరోహ బీజాంకురాలని' చెపుతాడు శ్రీనాథుడు. అంటే భవిష్యత్తులో గుణనిధి పొందే తేజోలోకపు కాంతి మత్యాపేక బీజాంకురం ఈ భవనాల్లోని వెలుగు. అతని శరీరం (కర్మ) భౌతికావసరం తీర్చుకోవడం కోసం చలిస్తున్నా, అతడి మనస్సు అజ్ఞాన తిమిరంతో సమరం జరిపి, ఆ దీపకాంతిలో దివ్యమూర్తి తేజోరూపాన్ని దర్శించింది. ఆ దర్శనానికి పిండి వంటకాలనుండి వస్తున్న గంధం సాధనమైంది. అందుకే అతడు బ్రతికి ఉండగా

చేసిన దొంగతనానికి భయపడ్డాడు. కానీ మరణించిన తర్వాత యమదూతలకు భయపడలేదు. ఇక్కడ భౌతికంగా దర్శనమిచ్చేవారు మనుషులు. మనో గోచరమైన వారు కింకరులు. అందుకే అతడి ఆత్మ కింకరులకు భయపడలేదు. అంటే తన 'మనస్సు' పవిత్రమైనదని తనను తాను తెలుసుకున్న దన్న మాట !

ఇలా అతినీచంగా జీవితాన్ని నడిపి, చరమ దశలో మోక్షాన్ని పొందిన కొన్ని ప్రత్యేక పాత్రలు క్షేత్ర మాహాత్మ్య కావ్యాల్లో మలచబడ్డాయి. వాటిని కవి అతి నైపుణ్యంతో చిత్రించిన వైఖరి కనబడుతుంది. వీటి ప్రభావం పఠితలపై ఉన్నా లేక పోయినా ఈ రకపు పాత్రలు మిగిలిన భక్తి పాత్రల కంటే విలక్షణతను, ప్రత్యేకతను కలిగి ఉన్నాయి.

అలాంటి గుణనిధి పాత్ర తత్త్వాన్ని– శ్రీనాథుడు పై విధంగా ఆవిష్కరించాడు.

**డా॥ సి. యస్వీ అచ్యుతశర్మ**
తెలుగు లెక్చరర్,
వి.వి.యస్.యస్.ఆర్. జూనియర్ కళాశాల,
ఐ. పోలవరం–533 223
తూర్పు గోదావరి జిల్లా.

# విష్ణుచిత్తుని గార్హస్థ్యజీవితం

ఆంధ్ర ప్రబంధోద్యానవనంలో పుష్పించి దశదిశలా పరిమళాలను వెదజల్లిన అపూర్వ అమర పుష్పాలలో కృష్ణదేవరాయలు సృష్టించిన 'ఆముక్తమాల్యద' అనే ప్రబంధ మొకటి.

ఈ ప్రబంధంలో విష్ణుచిత్తుని పాత్ర ప్రధానమైంది. ఇతడు యోగీశ్వరుడు, పూర్ణచరిత్రుడు నిత్యముక్తుడు, సార్థకనామధేయుడు, నిష్ఠాగరిష్ఠుడైన భాగవతోత్తముడు, చదువకుండగనే వేద వేదాంగ వేదాంతాల జ్ఞానం కలిగినవాడు. భవబంధాలను తెంపుకొని అడవుల్లో ముక్కు మూసుకొని తపస్సు చేయడమే ముక్తిమార్గమని గాక, భార్యాబిడ్డలతో జీవనం సాగిస్తూ, గృహస్థాశ్రమమే ఒక తపస్సుగా మోక్షమార్గాన్ని నిర్మించుకున్న విష్ణుభక్తుడు.

'యథావాయుం సమాశ్రిత్య, సర్వేజీవంతి జంతవః ।
తథా గృహస్థమాశ్రిత్య, వర్తంత ఇతరాశ్రమాః ॥'

చతురాశ్రమాల్లోను గృహస్థాశ్రమానికి ప్రత్యేకత ఉంది. బ్రహ్మచర్యం వాన ప్రస్థం, సన్యాసం అనే ఈ మూడు ఆశ్రమాలు గృహస్థాశ్రమం వల్లనే నిర్వహింప బడుతున్నాయి. గృహస్థాశ్రమానికి అర్హతనిచ్చే వివాహం కేవలం కామపురుషార్థానికే కాదు. శారీరక, మానసిక సంబంధాలకు అతీతంగా ఉన్న ధర్మాన్ని నిర్వహించడం కోసం. ధర్మ నిర్వహణ జగత్కల్యాణాన్ని చేకూర్చి, పరమపురుషార్థమైన మోక్షానికి సోపానమవుతుంది.

'ధర్మోపార్జిత జీవితానాం, శాస్త్రీయ జ్ఞానేష సదా రతానాం ।
జితేంద్రియాణాం మతిథి ప్రియాణాం, గృహేషు మోక్షః పురుషోత్తమానామ్ ।'

గృహస్థాశ్రమ యజ్ఞంలో, అతిథిసేవ ఒకటి. ఇంటికి వచ్చిన అతిథిని సాక్షాత్తు శ్రీమన్నారాయణునిగా భావించి పూజించడం హైందవ సంప్రదాయం అతిథిదేవో భవ అని గదా ఆర్యోక్తి ఈ ప్రబంధంలోని విష్ణుచిత్తుడు ఎటువంటి ఫలాపేక్షలేకుండా హిమాచల మలయాచలాలకు పోయే యాత్రికులకు మార్గమధ్యంలోని తన ఇంటిలో న్యాయార్జిత విత్తంతో (పురుషార్థం) నిత్యాన్నదానం చేసేవాడు. ప్రతిరోజు తులసిమాలలతో శ్రీరంగనాథుని సేవించేవాడు. నిరంతరం విష్ణువుని చిత్తమందు గలవాడై సార్థకనామధేయుడనిపించుకున్నాడు.

అతిథులకు ఏదో ఒకటి పెట్టి పంపామని కాకుండా, కాలానుగుణంగా వారికి భోజనం పెట్టి వారిని తృప్తిపరచేవాడు ఏ కాలంలో ఏ పదార్థాలు ఇష్టపడతారో ఆ పదార్థాలను పెట్టేవాడు.

వర్షాకాలంలో

అయ్యగపల ముంచిపెట్టుఁ గలమాన్నము
నాల్చినప్రప్పు నాలుగే
న్వ్రేగి పినకూరలు న్వడియము ల్వరుగు
లైరగు ష్షేపులిన్.

శీతాకాలంలో

పునుఁగుందావి నవోదనంబు, మిరియంపుం
బొళ్లతో, జట్టి చు
య్యను నా దాలని కూరగుంపు మొకుమందై
యేర్చునాం జిగు
ర్కొను పచ్చళ్ళును, బాయసాన్నములు,
నూరుంగాయలున్, జేసుల
క్కను నేయుం, జిలుపాలు వెల్లువగ
నాహారం బిడు న్సీతువన్.

వేసవికాలంలో- తెలినులి వెచ్చ యోగిరము,
దియ్యని చారులు, దిమ్మనంబులున్
బలుచని యంబళ్ళుజల్లె లెడసీల్చేరకు రసావళుల్
ఫలరసాను సుగంధిశీతజలము ల్వడిపిండెలు నీరు,
జల్లయున్
న్వేలయఁగ బెట్టు భోజనము వేసవి, జందన చర
ము న్నగున్.

ఈ విధంగా వర్షాకాలంలో వేడి వేడి అన్నము నాలుగై దుకూరలు, శీతాకాలంలో వేడివేడి అన్నియు మిరియాలపొడితో చేసిన కూరలు. పాయసాన్నము, వేసవికాలంలో కొద్ది వేడిగా ఉన్న అన్నము, చారు, మజ్జిగ, కొబ్బరినీరు, చెఱకు రసము మొదలైన చల్లని పానీయాలతో భోజనం పెట్టేవాడు. వైష్ణవులకు పర్వదినమైన శనివారం రోజు అతిథులకు అభ్యంగన స్నానానికి కావలసిన వసతులన్నీ స్వయంగా చూసేవాడు. అతని ఇంటిలో అర్థరాత్రివరకు హరికథలు, విష్ణుకథా సంకీర్తనలు వినిపిస్తూ ఉండేవి. ఇంతగా అతిథులకు వసతులు కలిగించి, భోజనం పెట్టినా విష్ణుచిత్తునికి మాత్రం తృప్తిగా ఉండేదికాదు.

ఈ విధంగా భగవంతుని సేవతోపాటు అతిథిసేవ చేయాలంటే విష్ణుచిత్తునికి, భార్య సహకారం ఎంతో అవసరం. వారిఅన్యోన్య దాంపత్య జీవితాన్ని పరిశీలిద్దాం.

కృష్ణదేవరాయలు విష్ణుచిత్తుని ధర్మపత్నికి ఎందుకో నామకరణం చేయలేదు కాని. ఆమె సాధ్వి అనిమాత్రం తెల్పాడు. ఆమె విష్ణుచిత్తుని నిరంతరం విష్ణుచిత్తునిగా చేసింది. అన్నికాలాల్లోనూ ఏ వేళలోనైనా సరే అతిథులకు భక్తితో భోజనం పెట్టేది.

భార్య కష్టసుఖాలను తెలిసినవాడు విష్ణు చిత్తుడు. ఆమెకు వంటచేయడంలో కూడా సాయ పడేవాడు.

'గగనము నీటిబుగ్గ కెనగా జడివట్టిననాళ్ళు భార్యకి
న్నాగ సొరకుండ నాలకెడపు బొటియ ల్దగిలింపి వండన్...'

వర్షాకాలంలో ముసురుపట్టి పొయ్యి మండక పోతే ఎండిన కొబ్బరి చిప్పల సహాయంతో మంట చేసి వంటచేయడంలో భార్యకు సహకరించేవాడు. విష్ణుచిత్తునికి భార్యపై గల అనురాగమట్టిది.

విష్ణుచిత్తుడు భగవంతుని ఆజ్ఞను శిరసా వహించి, మత-ప్రవక్తగా మధురకు ప్రయాణ మైనపుడు ఆతని భార్య భర్తకు కావలసిన సామగ్రి నంతా సర్ది సాగనంపింది. తినడానికి వేపుడు బియ్యపుపిండితో చేసిన లడ్లు, పవిత్రపరచిన బియ్యం చింతపండుతో కలిపి దంపిన చారుపొడి, వంట పాత్రలు, పెరుగు వడియాలు, దేవతార్చనకు కావలసిన సామగ్రి నంతా సర్ది సాగనంపింది. ఆమె పతిభక్తి అట్టిది.

శ్రీరంగనాధునికి ప్రతిరోజు తులసిమాలలు సమర్పించే విష్ణుచిత్తునకు తులసివనంలో శిశువు కనబడితే, సంతానంలేని తనకు శ్రీమహావిష్ణువే ఆ బిడ్డను ప్రసాదించాడని పరమానందభరితు డయ్యాడు. ఆబిడ్డను తీసుకువెళ్ళి తన భార్య కిచ్చాడు. ఆమె-'పెంచి పెంచి పెద్దచేసింది. దంపతు లిద్దరూ ఆ శిశువును చూసి అనురక్తులయ్యారు.

తమ కుమార్తెకు వివాహం చేయడంలో కూడా ఇద్దరూ సమానాత్ర వహించారు. '... — తదియ నిర్దిష్టంబగు వాంబూనరి పీఠంబున నుప విష్టుండై యతండు వెండియు బంగారు చెంబుల గనక భాజన నిక్షిప్తంబులగు కుశోదయ వేశల పడకిసలయంబులు గడిగి షోడశోపచార సహితం బును సంరక్షిక్కయంబునగు మధుపర్కంబు నొసంగం గొని యయ్యాళ్వారు దేవేరియుం దానును ధారవోయి నా కన్యకారత్నంబుం బరిగ్రహించెన్'

ఈ విధంగా దంపతులిద్దరూ శ్రీరంగ నాథునికి కాళ్లు కడిగి మధుపర్కాలిచ్చి కన్యాదానం చేశారు.

'అర్థస్య సంగ్రహం చైవ, వ్యయేచైవ నియోజయేత్' అని మనుస్మృతి. ధర్మాన్ని రక్షించ డంలో గాని, నిర్వహించడంలోగాని స్త్రీని నియోగిం చాలి. భార్య లేకుండా ఏ పురుషుడూ ఏ పనినీ తల పెట్టకూడదు. గృహస్థుగా విష్ణుచిత్తుడు భార్యకు తగిన స్థానాన్ని ఇచ్చి, కష్టసుఖాలలోనూ ధర్మ నిర్వహణలోను ఆమెతో సహజీవనం సాగించాడు.

తల్లిదండ్రుల ప్రేమవాత్సల్యాలతో అల్లారు ముద్దుగా పెరిగిన గోదాదేవి, శ్రీరంగనాధుని పై మరులుగొన్నదై విరహాన్ని అనుభవిస్తుంటే చూసి అర్థంచేసుకోలేక పోయాడు. ఈ అమాయకపు తండ్రి. ఒక్కగానొక్క కూతురు ఈ విధంగా తపించి పోతుందే అని బాధపడ్డారు. 'దిన దిన ప్రవర్థమాన తనయా గ్లాని కత్యంత దుఃఖి

తుదైన తత్త్వాన్వేషణకు బెలుగక వలదని మౌర్ఖ్యంబున వాదించి చూచి, కూతురు అనుభవిస్తున్న అవస్థనంతా భగవంతునికి విన్నవించుకున్నాడు. కూతురు శ్రీరంగనాథునిపై భక్తితో తపస్సు చేస్తున్నట్లుగా భావించాడు.

శ్రీరంగనాథుని ఆదేశానుసారం గోదాదేవిని తీసుకువెళ్ళే సన్నాహాలు చేస్తుండగా గోదాదేవి మాయమైంది. కూతురు కనబడక విష్ణుచిత్తుడు తల్లడిల్లిపోయి పెద్ద అలజడి సృష్టించాడు.

'ఆబ్రహ్మకీటము లోన వైదికానై సన్న్యా
యంబున స్మృత్యుక్తం
దాబ్రహ్మాదుల మేర నిల్పియు, బ్రభుత్వం
బూండయుందొంతురే
యాబ్రహ్మన్ ద్విజుఁజూడదయ్యా సభవా
రీరంగ భర్తంచు డు
ర్వ్యాబాశింబడి బాష్పకలతుండు సముద్యద్దో
వలాబిండునై'

తపస్సుచే ఎండిన చేతులెత్తి, తనకు న్యాయం చేకూర్చమని సభాసదులను వేడుకున్నాడు. తమ బిడ్డలు కనబడకపోతే తల్లి దండ్రులు పడే వేదన వర్ణనాతీతం. అభిజ్ఞాన శాకుంతలంలో శకుంతలను పెంచి పెద్ద చేసి ఆమెను పంపుతూ కణ్వ మహర్షి పడిన వేదన ఇంతింతకాదు.

ఈ విషయంలో విష్ణుచిత్తుడు భగవంతునికి కూడా లొంగలేదు. నన్ను మోసగించుట నీకు శక్యము కాదు' అని చెప్పవట్టాడు. విష్ణుచిత్తుడు చేసిన అలజడికి భగవంతుడు భయపడ్డాడు. చేసేది లేక గోదాదేవిని ఇచ్చేశాడు.

విష్ణుచిత్తుడు కూతురుని చూసిన వెంటనే 'ప్రమద బాష్పములల సామాన్య గృహస్థు మాదిరిగా ప్రవర్తించాడు.

బ్రహ్మ సరస్వతి శివపార్వతులు, అందరూ విష్ణుచిత్తుని దగ్గరకు వచ్చి శ్రీరంగనాథునికి గోదాదేవినిచ్చి వివాహం చేయుమని అడిగారు. అప్పుడు విష్ణుచిత్తుడు సర్వ్యాహమాటంగా వారితో ఆ భగవంతుని తన ఊరికి, తన ఇంటికే వచ్చి వియ్యమందమని బెట్టుచేశాడు. భక్తుని ఆజ్ఞను భగవంతుడు శిరసావహించక తప్పలేదు. విల్లిపుత్తూరుకు సకలదేవతా సమేతంగా వచ్చిన శ్రీరంగనాథునకు కాళ్ళు కడిగి కన్యాదానం చేసి, వైభవంగా కూతురుని వివాహం చేసి తన ముద్దు ముచ్చట్లు తీర్చుకున్నాడు విష్ణుచిత్తుడు.

ఈ విధంగా విష్ణుభక్తుడైన విష్ణుచిత్తుడు భార్యా బిడ్డలపై ప్రేమానురాగాలు కలిగి ఉంది. తన బాధ్యతలను నిర్వహిస్తూ గృహస్థుగా తన తపస్సును సఫలం చేసుకున్నాడు.

దంటు హేమలత
వేజెండ్ల–521 218
గుంటూరు జిల్లా.

# వాల్మీకి చరిత్రము రఘునాథుని కవితా వైశిష్ట్యము

దక్షిణాంధ్ర యుగపు వాఙ్మయం, ప్రక్రియా వైవిధ్యానికి పెట్టింది పేరు. అందులోనూ తంజావూరు కవుల దొక విశిష్టస్థానం. వాళ్ళల్లోనూ

రఘునాథనాయకుడిదే అగ్రతాంబూలం. అతను శతాధిక గ్రంథకర్త. సంస్కృతంలో రామాయణ సారసంగ్రహం, భారతసారసంగ్రహం, గీతాసుధ, సాహిత్యసుధ, భరతసుధ మొదలైన అనేక గ్రంథాలు రచించాడు. తెలుగులో రఘునాథ రామాయణం, నలచరిత్ర, వాల్మీకి చరిత్ర, శృంగారసావిత్రి, పారిజాతాపహరణం, అచ్యుతాభ్యుదయం, రుక్మిణీకృష్ణవివాహం (యక్షగానం), గజేంద్రమోక్షం, జానకీ కళ్యాణం మొదలైన అనేక గ్రంథాలు రచించాడు. కాని వీటిలో మొదటి నాలుగే లభిస్తున్నాయి.

రఘునాథరాయల గ్రంథ సముదాయంలో అలోత్తమమైంది ''వాల్మీకిచరిత్ర''. వాల్మీకి మహాముని చరిత్ర ఇందులో ఉన్న కథావస్తువని పేరుని బట్టే తెలుస్తోంది. వాశిష్టరామాయణం, భక్తవిజయం కావ్యాల్లోంచి మూలకథను గ్రహించి తనరచనను సామర్థ్యంతో క్రొత్తశోభల్ని సంతరించి గొప్ప ప్రబంధంగా తీర్చిదిద్దాడు రాజకవి రఘునాథుడు.

విష్ణుమూర్తిని దర్శనం చేసుకున్న సప్తర్షులు అనేక క్షేత్రాల్ని సందర్శిస్తూ దారితప్పి ఒక బోయపల్లి చేరారు. అక్కడ భీకరాకారుడైన ఒక కిరాతుడు వాళ్ళని అడ్డగించి హింసించబోతే, వాళ్ళు తమ మంత్రప్రభావంతో ఆ కిరాతుడిలో ఉన్న క్రూరత్వాన్ని అణిచివేశారు. వాళ్ళ శక్తిసామర్థ్యాలకు ఆశ్చర్యపడిన కిరాతుడు ఆలుబిడ్డల్ని వదిలి సన్యసించాడు. కాలక్రమంలో అతడే వాల్మీకిగా ప్రసిద్ధి పొందాడు. ఇతని జీవిత వృత్తాంతాన్ని రఘునాథుడు తన కావ్యంలో చక్కగా పొందుపరిచాడు.

సప్తర్షులు చేసిన పుణ్యక్షేత్ర దర్శనాన్ని ఆధారంగా చేసుకొని కవి అనేక ప్రాంతాల్ని వర్ణించాడు. ఈ వర్ణనం రఘునాథుని మత సహనానికి నిదర్శనంగా ఉంది. శివకేశవులకి భేదం లేదనే తత్త్వాన్ని ప్రతిపాదించటమే దీంట్లో ఉన్న పరమార్థం.

వాల్మీకి చరిత్రం ఒక ప్రబంధం కాబట్టి, ప్రబంధంలో అష్టాదశ వర్ణనలు ఉండాలి, అందువలన రఘునాథుడు ఇందులో కొన్ని వర్ణనలు చేశాడు. వాటిలో గ్రీష్మఋతు వర్ణనం అద్భుతంగా ఉంది.

'ఆ కాశీశ్వరు శార్ఙ్గి
యైక విలోచనము నందు నెసగెడు సెగలే
పై కొనియె ననగ లోకం
బాకులపడ దోచె గ్రీష్మమతి భీష్మంబై'
'చట చట పగిలెం గుండిని
తట తట పథికుల మనంబు తల్లడ వడియెన్
జిట జిట నెగసెన్ దవశిఖి
కట కట గ్రీష్మం బొకింతకనఁబడునంతన్,

వర్ణన వర్ణన కోసమే అన్నట్టు కాకుండా కవి ఆ వర్ణనల్ని కథాంగాల్లోకి చొప్పించాడు. అట్లాగే బోయపల్లె వర్ణనం చాలా స్వభావ సిద్ధంగా ఉంది. మహారాజైన రఘునాథుడు బోయపల్లెని యింత చక్కగా ఎలా వర్ణించాడా! అనిపించింది.

బోయపల్లెలో ప్రవేశించిన మునుల్ని భీకరాకారుడైన కిరాతుడు అడ్డగించి హింసించబోతాడు. వాళ్ళ తపోశక్తి వల్ల అతని ఆయుధాలు వాళ్ళనేమీ చెయ్యలేకపోతాయి. అప్పుడు ఆ మునులు ఆ కిరాతుడికి హితబోధ చేస్తారు.

'ప్రాయము జెక్కల్తోల
ప్రాయము కాయంబు నస్థిరం బందులకై
రోయక దురితమె తపమని
హాయక చేసెదవు నిందపరగం బుళిందా'

నిషాదుడి హృదయం పరివర్తనం చెంద టానికి దోహదం చేసిన యీ హితబోధ మానవ జీవితానికే వ్యాఖ్యానం వంటిది తాను చేసిన పాపా లలో భార్యాబిడ్డలు పాలు పంచుకుంటారో లేదో తెలుసుకోవాలని నిషాదుడు తనయిల్లు చేరి, ''ఓ పడతీ! నేను చేసే పాపాల్ని గురించి ఆలోచించే అవసరం నీ కుందా!'' అని గద్దించి అడుగుతాడు. అందుకు ఆ బోయస్త్రీ యిట్లా ఉంది.

''
...... నాయకా! తలప నాకు నీదగు పాపం బునకుం బనిలేదు. నీప్రాపున నెంతయు గుడిచి కట్టి పొనగుట కన్నన్''

''ఎవులగ వారికెవ్వరి కతంబున నీ వెరవప్పు దీసితె
త్తువో కొని తెత్తువో తెరువు దోచుచుం దెత్తువో జూదమాడితె
త్తువో చని తెత్తువో యదియు దోసము పున్నెమొ నాకు నేటికిన్
రవరవ నీవు తెచ్చినవి దాంచక వంశగ, బాడి డిచ్చుటన్''

కవి ఇక్కడ ప్రదర్శించిన పాత్రోచిత మైన సంభాషణచేసి భావ వ్యక్తీకరణ సామర్థ్యం అనితర సాధ్యం అనవచ్చు. భార్య మాట కి కను విప్పు గలిగిన నిషాదుడు సంసారాన్ని వదిలి, ''మరా, మరా'' అని తిరుమంత్రాన్ని పఠిస్తూ తపోదీక్షకు సిద్ధపడ్డాడు అదిచూసి ''బాపనపయ్యాము పట్టినది బాపురే!'' అంటూ అతన్ని బాధించ టం మొదలు పెట్టారు తక్కిన బోయవాళ్ళు. ''మాయామోహితమైన యీ జగత్తులో మానవ కల్పి తాలైన బంధువులు, మిత్రులు, భార్య, పిల్లలు, అనే మాయపొరని తొలగించుకొని నిజాన్ని అన్వేషించే మనస్తత్వాన్ని పెంచుకోండి'' అని హెచ్చరించాడు.

ప్రబంధాలకి శృంగారరసం ప్రధానమైంది. కాబట్టి ఆటవిక జీవితాన్ని ప్రతిబింబింపజేసే 'వాల్మీకి చరిత్రం'లో వాళ్ళ సంసార వర్ణనం అద్భుతంగా వర్ణించబడింది. ఆటవికుల్ని గూర్చి రచించిన ఘనత మొదట ధూర్జటికి దక్కింది. ఆ తరవాత కాలంలో ధూర్జటిని మించి ఆటవిక శృంగారాన్ని వర్ణించిన ఖ్యాతి రఘు నాధునికే దక్కింది.

ప్రతి గ్రంథంలోనూ రచయిత సమకాలిక పరిస్థితుల్ని, సాంప్రదాయాల్ని, ఆచార వ్యవ హారాల్ని మిళితంచేసి మన మనోనేత్రాల ముందు ఉంచుతాడు. అట్లాగే ఈ వాల్మీకి చరిత్రలో కూడా కవి కిరాత వనితల వర్ణనలో సమకాలీన పరిస్థితుల్ని చొప్పించాడు.

ఘోరదీక్షలో తపస్సుచేస్తున్న కిరాతుడి తపోగ్ని చతుర్దశ భువనాలకు వ్యాపింపడంతో ఇంద్రాదులు తల్లడిల్లారు ఆ సమయంలో జరుగుతున్న రంభా, ఊర్వశుల సంవాదాన్ని మధ్యలోనే ఆపి ఆ కిరాతుడికి తపో భంగం చేసిరమ్మని ఆజ్ఞాపించారు. కాని, వాళ్ళ ప్రయత్నం ఫలించక, వట్టి చేతులతో తిరిగి వచ్చారు.

రంభ, ఊర్వశుల సంవాదం చమత్కారాన్ని కలిగిస్తూ, రసౌచిత్యాన్ని ప్రతిపాదిస్తోంది. ఈ

ఘట్టం, ప్రధాన కథకి దోహదం చెయ్యకపోయినా, కవి పాండితీ ప్రకటనకి, రసికతని వెల్లడించు కోటానికి ఈ ఘట్టం సహకరిస్తోంది. సంగీత సాహిత్యాలే కాక నాట్యశాస్త్రం కూడా తెలిసిన రఘునాథుని సర్వతోముఖ ప్రజ్ఞకు యిది తార్కాణం. వాగ్గేయ కారుడు కాబట్టి తానే సృష్టించిన 'రఘునాథ మేళ' రాగాన్ని కూడా ఈ కావ్యంలో చొప్పించాడు.

రఘునాథుడు ప్రకృతి వర్ణనల్ని చేర్చి, తనది అందులో కూడా అందెవేసిన చేయేనని నిరూపించుకున్నాడు. ద్రవిడ దేశంలోని పుణ్య క్షేత్రాల్ని వర్ణించే సందర్భంలో ఈ కవి ద్రావిడ దేశపు ప్రకృతి సౌందర్యాన్ని స్వభావ సిద్ధంగా చిత్రించాడు. ముని ఆశ్రమ వర్ణను ఇతరులెవరూ చేయనంత చక్కగా చేశాడు.

ఈ కావ్యంలో కొన్ని పూర్వకవుల అనుసరణలు కూడా ఉన్నాయి. అంతేకాక, కొన్ని ప్రసిద్ధి పొందిన శ్లోకాలకి తెలుగు అనువాదాలు కూడా ఉన్నాయి. ఉదాహరణకి— 'పంకజ బంధు బింబస్థాయి, త్రైలోక్య మంగళ దాయి, శ్రీరంగ శాయి' అనే పద్యం, సంకుసాల నృసింహకవి రాసిన 'కవికర్ణ రసాయనం'లో ఉన్న శ్రీరంగనాథ స్తవాన్ని స్ఫురింపజేస్తోంది. అట్లాగే 'ఎక్కడ యత్ర రఘునాథకీర్తనం' అనే శ్లోకానికి అనువాదంగా ఉంది.

వాల్మీకి చరిత్రలో కవి ఛందోబద్ధమైన కవిత్వానికి రసం జోడించబడితే, అది బంగారానికి తావి అబ్బినట్లౌతుంది 'అని చెప్పాడు. చక్కని మాటల కూర్పుతో, రసవంతమైన, అర్థవంతమైన రచన కవిత్వం. కవితాలక్షణాలకి, వ్యాఖ్యానానికి ఉదహరించడానికి ఎంతో తగి ఉంది వాల్మీకి చరిత్రం. రాజకవి రఘునాథుని కవిత్వం లలితమైన పద ప్రయోగంతోను, చక్కని గమనంతోనూ సాగింది. శబ్దాలంకార రచనలో రఘునాథుడిది అందెవేసిన చెయ్యి. ఇతడికి అంత్యానుప్రాస మీద గల ప్రీతికి, 'రోయమిటారి కత్తియం' అనే పద్యం ఉదాహరణ. భావాలకి అనుగుణంగా ఛందస్సుని నడపడంలో ఈ కవికున్న నైపుణ్యం, వారణాసి పట్టణాన్ని వర్ణించే సందర్భంలో తెలుస్తుంది.

మొత్తంమీద యీ కావ్యం రసపూరితమై, తంజావూరులో వెలసిన కావ్యాలన్నింటిలో ఒక విశిష్టమైన స్థానాన్ని సంపాదించుచున్నది.

సి. శ్రీనివాస కౌండిన్య
లెక్చరర్,
యమ్.యన్.ఆర్ డిగ్రీ కాలేజి
కూకట్‌పల్లి, హైదరాబాదు.

# కథావీథి

## అంతస్తులు–అనుబంధాలు

— డా॥ జి. ఉషాలావణ్య

ఇంకా పూర్తిగా తెల్లార లేదు.

ఊరి పొలిమేరల్లో రోడ్డుకు అటుయిటు వున్న టీ బంకులు, చిన్న చిన్న హోటళ్ళు మసక చీకట్లలో మునిగి పోయినట్టున్నాయి. ఆ చీకటి తెరలు తొలగించుకుంటూ హోటళ్ళలో పని చేసే కుర్రాళ్ళ అరుపులు, రేడియోలలో పాటలు, ఇంకేవో వింత ధ్వనులూ అన్నీ కలగాపులగంగా వినిపిస్తుంటే మరో వింత లోకంలో ఎక్కడో విహరిస్తున్నట్లుంది మనసుకు.

ఎదుటి టీ బంకులో టీయ్ తాగొచ్చి తిరిగి కారు స్టార్ట్ చేశాడు డ్రైవరు.

రెండు గంటల ప్రయాణం యిల్లు చేరుకోడానికి.

ఆ తర్వాత ?

ఆ తర్వాత జరగబోయేది తల్చుకుంటేనే భయంగా వుంది.

ఊహుఁ భయం కాదు–దిగులు! గుండెల్నిండా పేరుకుపోయి బ్రతుకును బరువుగా చేసే దిగులు.

ఇన్ని కటు అనుభవాలు, చేదు నిజాలు రుచి చూడాల్సి వస్తుందని కలలోనైనా వూహించని భావుకతలో సార్థకత కోసం చేసే పోరాటంలో జీవితం యిప్పుడు నన్ను ఏమలుపులో నిలిపిందో కూడా అర్థంకాక పోయినా ముందు ముందు ఏమవనున్నదో నన్న చింత మాత్రం ఆమెలో మిగిలింది.

రాత్రంతా తెగ విరగబడి సువాసనలు వెదజల్లి, తెల్లారగానే గోడమీదుగా నేల జారిపోయే పారిజాతాలు రోజూ వ్యర్థంగా పూసి వాడిపోతూనే వుంటాయి

కొందరి జీవితాలు కూడా అంతే !

ఉన్నట్టుండి తనకు పక్కవూరికి బదిలీ అవటమూ–పిల్లలచదువులు పాడవకుండా అక్కడే యిల్లు తీసుకోవడమూ–రోజూ ఆయన యింటికీ ఆఫీసుకీ తిరగాల్సి రావడమూ ఖర్చుకు ఖర్చు పెరగడమూ, అపైన అలిసి పోయి యిల్లు చేరిన మనిషి అకారణంగానే తనపై విసుక్కోవడమూ–ఓపిక నశించి తనూ బదులు చెప్పడమూ–చిన్న చిన్న మనస్పర్థలు! ఇవన్నీ తాత్కాలికమైన యిబ్బంది

లేనని స్క చెప్పుకుంటుంటే యిప్పుడు పిడుగు పాటులా ఈ యాక్సిడెంటు!

వెన్నెముకకు బలమైన దెబ్బ తగిలి ఇక లేచి తిరుగుతాడన్న నమ్మకం లేదని డాక్టర్లు చెప్పినప్పుడు, ట్రీట్‌మెంట్ కోసం బ్యాంకు బ్యాలన్సులన్నీ ఖాళీ అయినప్పుడు, కుటుంబ భార మంతా తానే మోయాల్సి వచ్చినప్పుడు ఏమాత్రం చలించక బాధ్యతలు స్వీకరించిన మనసు ఇప్పుడు ఆలోచించే శక్తి కూడా లేనట్టు మొద్దుబారిపోయింది.

దాదాపు ఏడెనిమిది నెలలుగా చెకప్ కోసం మద్రాసుకు తీసుకువెళ్తోంది. కోలుకుంటాడని నమ్మకం ఏమీ లేకున్నా ప్రయత్నం చేసిచూద్దాం అన్న ఆశ! పూర్తిగ కదలలేని స్థితిలో వున్న మనిషిని అంతదూరం బస్సుల్లోనూ ట్రెయిన్లలోను తీసుకెళ్ళడం అంత సులభం కాదు ఖర్చు సంగతి సరేసరి.

తన పరిస్థితిని అర్థం చేసుకున్నవాడు కాబట్టే తనకు తనే కల్పించుకుని తన డ్రైవరును వెంట పంపి కార్లో వెళ్ళి వచ్చే ఏర్పాటు చేశాడు మహేంద్ర. అందులో స్వార్థం ఏంతమాత్రం లేదు. తాను యిష్టపడే వారికి సహాయ పడాలన్న మంచి మనసే వుంది.

అదే కంటగింపుగా తయారయింది అందరికీ. అవసరానికి ఏమాత్రం ఆసక్తి చూపించకుండా సానుభూతులు పరామర్శలు గుప్పించిన వాళ్ళంతా యిప్పుడు తనవైపు వేలెత్తి చూపిస్తున్నారు. అసలీ మనుషులు యింత వికృతంగా ఎందుకు ప్రవర్తిస్తారో! తాము చేయలేని పని మరోమనిషి చేసిచూపించడం సహించలేకనేనా?!

ఏంలేనిస్థితిలో భర్త—చేతికి అందరాని పిల్లలు—తన చిన్న వుద్యోగము— ఎంతో కష్టంగా బ్రతుకు నెట్టుకు వస్తోంది అంటే అది తను అండగా వుంచ...బట్టే కేవలం మాట సహాయంతో తనలో ఆత్మ స్థైర్యాన్ని కలిగించాలని చూడబట్టే!

కానీ యిప్పుడు తన భర్తే అతడి రాక పోకలపై ఆంక్షలు విధిస్తున్నాడు— చావడానికైనా ఒప్పుకుంటాను గాని మనను గురించి నలుగురూ నాలుగు విధాలుగా మాట్లాడుకోవటం సహించలేనని.

ఇప్పుడో యిల్లు చేరుకోగానే తను వస్తాడు

మెడికల్ రిపోర్టులన్నీ చూసి ఒక డాక్టరుగానే కాకుండా ఒక మంచి మనిషిగా అవసరమైన ఏర్పాట్లన్నీ చేసి సహాయపడాలని చూస్తాడు.

అప్పుడు ఏనోటితో యిక నుంచి మా యింటికి రావద్దు అని చెప్పగలదు ఏ భాషలోని మాటలన్నింటినీ పొందు పరచుకొని అతడితో తనీ మాట అనగలదు?

భర్త గట్టిగా చెప్పాడు— యిలా వెళ్ళి రావటం యిదే ఆఖరుసారి కావాలని కాబట్టి తప్పదు. కానీ...ఎలా?

తన అంతర్మథనాన్ని గ్రహించినట్టే వున్నాడు. మద్రాసుకు బయల్దేరక ముందే అడిగాడు 'అలా వున్నావేం?' అని.

తన మౌనమే సమాధానం.

'ఏమిటి యింకేదైనా ప్రోబ్లమ్ వచ్చిందా'? రెట్టించి అడిగాడు.

మాట నోటి వరకు వచ్చినా జవాబు చెప్పలేక పోయింది.

'ఏమిటి యింకేదైనా ప్రోబ్లమ్ వచ్చిందా? రెట్టించి అడిగాడు.

మాట నోటి వరకు వచ్చినా జవాబు చెప్పలేక పోయింది.

"ఏం మాట్లడకుండా నీలో నువ్వే ఆలోచించు కుంటూ బాధ పడితే నాకెలా అర్థం అవుతుంది చెప్పు. ఆ స్వరంలోని మృదుత్వానికి మనసు చెమ్మగిల్లింది.

ఏం చెప్పను?

నీ మంచితనాన్ని మా వాళ్ళు భరించలేక పోతున్నారని చెప్పనా?

ఏ బంధుత్వమూ లేని ఒక స్త్రీకి ఒక పరాయి వ్యక్తి అండగా నిలబడటం ఈ లోకం హర్షించదని చెప్పనా?

అన్నీ తెలిసీ ఏమీ తెలియనట్టే తనపై మోపిన అభాండాలన్నింటినీ చిన్న నవ్వుతో కొట్టి పడేస్తూ అంత ఎత్తుకు ఎదిగిన నీవ్యక్తిత్వం ముందు నా మనసు రెండు చేతులూ జోడించి తల వాల్చు తోంది అని చెప్పనా?

నిష్కల్మషమైన మనసులతో ఆత్మీయతలను పంచుకునే నిన్నూ నన్నూ ఈలోకం నిర్దాక్షిణ్యంగా వేరు చేసి ఆనందిస్తుంటే, సూటిపోటి మాటలతో గుండెల్లో కత్తులు గుచ్చుతుంటే భరించలేక పోతున్నానని చెప్పనా!

ఏమని చెప్పను?

'సర్లే. తిరిగి వచ్చాక మట్లాడుకుందాం ముందు మీరు బయల్దేరండి నాకూ ఒక అర్జంట్ కేస్ వుంది. లేకుంటే నేనూ వచ్చేవాడని' అంటూ వెళ్ళిపోతున్న మనిషిని చెమరించిన కళ్ళతో చూస్తూ నిల్చుండిపోయింది తను.

ఎడతెరిపి లేకుండా కూసే వర్షపు ధారల్లో ఆచూకీ అయినా దొరకని రాత్రి వెన్నెల్లో శాఖోప శాఖలుగా పరుచుకున్న నిండుగా పూసిన పడమి చెట్టును అల్లుకు పోయిన సన్నజాజి తీవెలు పూల కన్నీళ్ళు కురిపిస్తూ సుప్తవ్యథలు కలబోసుకున్న జ్ఞాపకాల సుగంధాలను నిశ్వసిస్తుంటే ఆ సుగంధాలు ఒక్కసారిగా నన్ను చుట్టుముట్టి నట్టైగతం తాలూకు దృశ్యాలన్నీ ఒక్కొక్కటిగా కళ్ళముందు నెమ్మదిగా పరుచుకు పోతున్నాయి. దూరమౌతున్న అతని అస్పష్ట ఆకారంలో వర్తమానం కనుమరుగౌతుంటే గతం నింపాదిగా కళ్ళముందు పరుచుకు పోతుంది.

ఏనాటిదీ పరిచయం!

ఎన్నెన్ని జ్ఞాపకాలు!

ఆ జ్ఞాపకాల మాటున ఎన్నెన్ని ఆలోచనలు-మనసుకు తట్టి లేపేవి,

జీవిత కటు సత్యాలను విప్పి చెప్పేవి!

అసలు ఏమిటీ బంధం యిద్దరి మధ్యా?

ఇది ఇద్దరు స్త్రీ పురుషుల మధ్య వుండే మామూలు ఆకర్షణ మాత్రం కాదు.

ఈ లౌకిక బంధాలు బాంధవ్యాలు అన్నిటికీ అతీతమైన మరేదో అనుబంధం.

వ్యక్తుల మధ్య మనము మన సమాజము స్వీకరించిన మానవ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలే అయితే—తమ విషయంలో మాత్రం అది నిజంకాదు.

మరి ఏది తమ నిద్దరినీ కట్టి పడేసింది.

భర్త పిల్లలు ఆయన వారు—ఎవరికీ యివ్వని విలువ ఈ పేరు లేని సంబంధానికి యిస్తున్నాను— కాని దానికి 'ప్రేమ' అని పేరు పెట్టుకోవడానికి

కూడా మనసు అంగీకరించటం లేదు. మరి ఏమిటిది? ఏమనాలి ఈ స్నేహాన్ని?! ఈ అనుబంధాన్ని ???

× — × × — ×

హడావుడి పడుతూ సామాన్లన్నీ సరిగా వున్నాయా లేదాని చూసుకుని కూలీకి డబ్బులిస్తుండగానే బయల్దేరింది రైలు. ఎప్పుడెప్పుడు పక్క పరిచి కాసేపు నిద్ర పోదామా అని వుంది నాకైతే.

మా స్కూలు మెయిన్ రోడ్డుకి దాదాపు రెండు మైళ్ళ దూరంగా వుంటుంది. టౌన్లోకి రావాలంటే స్కూల్ వాన్ ఒక్కటే గతి. మేం మెయిన్ రోడ్డులో ఆర్టీసి బస్సు పట్టుకుని స్టేషను చేరుకునే సరికి అయిదు దాటిపోయింది. ట్రైను కదలడానికి సిద్ధంగా వుంది అప్పటికీ మూడు గంటలకే బయల్దేరాము.

ఆ సంవత్సరమే ఎమ్ ఏ. ముగించుకుని పి. హెచ్ డి. కి రిజిష్టరు చేసుకున్నా ఖాళీగా వుండటం ఎందుకు అని ఈ ఉద్యోగంలో చేరాను. దసరా శెలవుల్లో లైబ్రరీకి తిరిగి మేటర్ కలెక్టు చేసుకుందామని ప్రోగ్రాం వేసుకున్నాం నేనూ, సరళ. అందుకే ఈ ప్రయాణం.

అందరూ యింకా నిద్ర లోనే వున్నారు. రైలు సిటీ లిమిట్స్ దాటి స్పీడందుకుంది. చీకటిని చీల్చుకుని పోతున్నట్టుగా పెద్దగా కూతేస్తూపోతోంది రైలు. తెల్లవారడానికి యింకా చాలా టైం వుండటంతో మాతో పాటే అదే స్టేషన్లో ఎక్కిన అతను తనకు ఎలాట్ అయిన కింది బెర్తులో పక్క పరవడానికి ప్రయత్నాలు చేస్తున్నాడు. పై రెండు బెర్తులు మావి, మంచిదే! ఏ డిస్టర్బెన్సూ లేకుండా హాయిగా పడుకోవచ్చునని పైకి ఎక్కేశాను నేను. అయితే కాఫీ టీలు అమ్మేవాళ్ళ అరుపులతో ఎక్కువ సేపు పడుకోలేకపోయాను. నిద్రరాకుండా పడుకుని వుండాలంటే విసుగు. అలా అని కిందికి దిగుదామంటే సరళ, ఆ క్రిందిబెర్తు శాస్త్రీ యిద్దరూ మంచి నిద్రలో వున్నట్టున్నారు.

తిరిగి పడుకోబోతూ ఎదురుగా అప్పర్ బెర్త్లోపడుకున్న వ్యక్తి వైపు చూశాను. మోచేయి నుదిటిని ఆనించుకుని నన్నే చూస్తున్నాడు. నేను తనను చూశానని తెలిసీ చూపు మరల్చుకునే పనేం చెయ్యలేదు.

అప్పుడే దిగడం ఎలాగూ కుదిరేలా లేదని ఆశాల్తీని తప్పించుకోడానికి అతడివైపు వీపు పెట్టి పక్కకి తిరిగి పడుకున్నా యింకా చూపులు గుచ్చుకుంటున్నట్లే అనిపిస్తోంది. ఇటు వైపు తిరిగితే అంతవరకు సంస్కార వంతుడికి మల్లే అటు తిరిగి పడుకున్న వాడల్లా తిరిగి యిటు తిరిగాడు. ఇక పడుకుని వుండటం నావల్ల కాదనిపించింది.

బాగ్లోంచి పేస్టు బ్రష్ తీసుకుని కిందికి దిగుతుంటే అతడూ సూట్కేస్లోంచి తనకు కావల్సినవి తీసుకుని దిగాడు. నేనేం చేస్తే దిటా ఘాటుగా ఏమైనా అందామని వుందిగాని ఏకారణం చూపించను? మొహం కడుక్కుని వచ్చి సరళను లేపేశాను. ఈ హడావుడికి క్రింది బెర్తు శాస్త్రీ కూడా లేసేశాడు పాపం.

మొహాలయితే కడిగాం కానీ, అంతా 'చాయ్ చాయ్' అనే వాళ్ళే. కాఫీలు అమ్మేవాడు ఒక్కడూ కనిపించలేదు. తెల్లారి ఒక గుక్క కాఫీ పడితేగాని నా ప్రాణం నిలవదు. మా సమస్య అర్థం చేసుకున్నట్టున్నాడు. పై బెర్త్ శాస్త్రీ, 'డైనింగ్ కారు వుందండీ కాఫీ కూడా దొరుకుతుం' దని తనే అందరికీ కాఫీకి ఏర్పాటు చేసి వచ్చాడు.

ఉపకారం చేసిన మనిషివల్ల సరళకు అపారంగా కృతజ్ఞత పెరిగిపోయింది. నాకేమో యింకా మంటగానే వుంది. ఆడపిల్లలకి యిలా సహాయపడినట్లు నటించి దాన్ని స్నేహం పేరిట ప్రేమలోకి దించి మోసాలు చేసే ఘరానా దొంగల్ని ఎంత మందినో చూసింది.

కాసేపయాక సరళ నేను కబుర్లలో పడ్డాం. యూనివర్శిటీ వదిలి చాలారోజులు ఆవడంతో చెప్పుకోడానికి బోల్డన్ని విషయాలు— మేము కాలేజ్ డే సెలబ్రేషన్స్ లోనూ, కల్చరల్ ప్రోగ్రామ్స్ లోనూ గెలిచిన సంగతులు—ఆ సందర్భంలో విద్యార్థుల మధ్య జరిగే గొడవలు— ముందెప్పుడో ఒక ముఖ్యమైన మీటింగులో మమ్మల్ని 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' పాడమని ఆహ్వానించడము, తీరా ఆర్కెస్ట్రాతో ప్రాక్టీసు కూడా మొదలుపెట్టాక ఆ ఆఫర్ వేరే గ్రూపుకి యివ్వడము-వుక్రోషంతో ఆ గ్రూపులో వాళ్ళకి నిక్‌నేమ్స్ పెట్టుకుని మాలో మేమే వాళ్ళని తిట్టుకోడం. ఇప్పుడు వాళ్ళతోనే మంచి స్నేహం కుదరటము— అన్నీ గుర్తు చేసుకున్నాం.

అంతవరకు ఎటు అదృశ్యమై పోయాడోగాని క్రిందిబెర్తు శాల్తీ తువాలుతో మొహం తుడుచుకుంటూ వచ్చి ఎదురుగా కూర్చుంటూ మమ్మల్ని చూడగానే ఆనందమో ఆశ్చర్యమోగాని కనుబొమ్మలు ఎగరేసి ముందుగా సరళని పలకరించాడు. ఆ తర్వాత తన పరిచయం చేసుకున్నాడు. అతడు చంద్రబాబు నాయుడు గ్రూపుతో ఎలక్షన్లో పోటీ చేసింది సరళతోనేనని. అంతే! అప్పటి విరోధాలన్నీ మర్చిపోయి ఇద్దరూ యూనివర్శిటీ రాజకీయాల్లో పడిపోయారు. ఈ కాలేజ్‌పాలిటిక్స్‌లో నాకంత ఇంటరెస్ట్ లేదు వెంట తెచ్చుకున్న నవల మొదలేశాను. వాళ్ళ మాటలూ చెవుల్లో పడుతూనే వున్నాయి పై బెర్త్ శాల్తీ కూడా కలిపించుకుని ఎవరిది సబ్జెక్టు అని అందరి వివరాలు అడుగుతున్నాడు. సరళ నా వివరాలు చెప్తుంటే ఒకసారి కళ్ళెత్తి చూసి తిరిగి నవల మొదలు పెట్టాను గాని పొద్దున్నే నవలమీద మనసు నిలవడం లేదు. వాళ్ళేమో విద్యార్థి సంఘాల నుంచి సినిమాల మీద పడ్డారు మధ్యలో వన్-బై-టు 'కాఫీ'లు ముగించి యిక కామన్‌గా మాట్లాడుకోడానికి ఏమీ లేక మౌనంగా అయిపోయారు.

ఏదో చిన్న స్టేషన్

ఆగక పోయినా నిదానంగా వెళ్తోంది రైలు ప్లాట్ ఫారమ్ దాటాక పట్టాలకి కాస్త దూరంగా వరసగా నిలబడి పిల్లలు చేతులూపుతున్నారు.

నాకూ వుత్సాహం వచ్చింది.

చూస్తున్న పుస్తకం పక్కన పడేసి చెయ్యూపడం మొదలుపెట్టాను. ఒక్కడూ నావైపు చూడడే! ఎదిటో చూస్తూ చేతులు మాత్రం జోరుగా వూపేస్తున్నారు.

అంత ప్రేమగా నేను చెయ్యి నొప్పి పుట్టేలా వాళ్ళు పూర్తిగా కనుమరుగయే వరకు వూపినా ఒక్కడూ నా వైపు చూసినట్టులేదు. మొద్దు మొహాలు.

ఆ మాటే కసిగా పైకన్నాను.

కబుర్లతో మధ్యాహ్నం భోజనం టైం వరకు గడిపేశాం. కింద బెర్తు శాల్తీ ఈ సారి కాస్త శివరాత్రి చూపిస్తూ పైకి షిఫ్టయి పోయాడు. నాకేమో పగటి పూట పడుకోవటం ఏదో ప్లాట్ ఫారం మీద పడుకున్నట్టు నడిబజార్లో పడుకున్నట్లు అనిపించడంతో నవల చదవడం మొదలు

పెట్టాను. సరళ పక్కనే పడుకుని కునుకు తీస్తోంది. ముందు నవల కాస్త విసుగనిపించినా పోను పోను కాస్త యింటరెస్టింగానే వుంది. పరిసరాలన్నీ మర్చిపోయి అందులో పూర్తిగా లీనమైపోయాను.

ఎప్పుడొచ్చాడో కూల్ డ్రింక్స్ కుర్రాడు.

ఎదుటి బెర్తు శాస్త్రి తనతోబాటు నాకూ ఆఫర్ చేస్తున్నాడు.

'ఎందుకండీ'! మొహమాటంగా అన్నాను.

'పర్వాలేదు. తీసుకోండి' అన్నారు చూస్తుంటే మర్యాదస్తుడిలాగే వున్నాడు. అనవసరంగా నేనే ఏదేదో వూహించుకుంటున్నానేమో.

'ఈ ప్రయాణాలు చేయడమంత బోరింగ్ థింగ్ యింకొకటి వుండదు. ఇంట్లో వున్నట్టు ఎప్పుడేం చేయాలంటే అది చేయలేం కదా. అందుకే మీరు పడుకున్నంతసేపు నేనూ పడుకున్నాను. మీరు లేస్తే నాకూ లేవాలనిపించింది. అన్నాడు. సంజాయిషీ యిచ్చే స్వరం కాదది. చాలా కాజువల్‌గ జరిగింది చెప్తున్నట్టు చెప్పాడు అంతవరకు అతడంటే వున్న అభిప్రాయం 'పోనీలే' అనుకుని కాస్త మారింది

మమ్మల్ని చూసి సరళ లేచి కూర్చుంది. 'అన్యాయం. మీరు మట్టుకే తాగేస్తున్నారు' అంటూ

'మీరు పడుకున్నారు కదా' అంటూ తనకూ తెప్పించి యిచ్చాడు ఆలోచిస్తే అతని మాటల్లో ఎక్కడా తెచ్చిపెట్టుకున్న గొప్పతనం లేదు. అలా తనకు తోచింది చేసెయ్యడం మనసులో మాట స్పష్టంగా చెప్పెయ్యడం అలవాటైన పనిలా వుంది అవతలి ఎదుటి మనిషిని అంచనా వేయటం అతడికి చాలా సులభమైన పని అన్నట్టుగా వుంది. అతడి వ్యవహార సరళి చూస్తుంటే.

తిరిగి నేను నవల చదువుకోబోతుంటే లాగేసుకుంది సరళ.

'వద్దు నాకు బోర్ కొడ్తోంది'.

'అయిపోవచ్చింది— ఒక పదినిముషాలు... ఇంటరెస్టింగ్‌గా వుంది.'

'ఊహూ రాత్రికి నేను పడుకున్నాక కావాలంటే చదువుకో.'

'ఆఁ: నువ్వు పగలంతా పవళిద్దువుగాని నేను నువ్వు పడుకున్నాక చదువుకుంటాను,' ఏం కుదరదన్నట్టు మొండికేశాను.

ఏముంటుంది అసలీ పుస్తకాల్లో! హీరో ఎవర్నో ప్రేమిస్తాడు—మరొకర్తెను పెళ్ళి చేసుకుంటాడు. ఆ హీరోయిన్ పాపం విరహ గీతాలు పాడుకుంటూ కూర్చుంటుంది. ...అంతేగా. వ్యంగ్యంగా అంది.

ఎందుకంత ఆవేశపడిపోతావ్. అయినా ఈ నవల రొటీన్ నవలలకి కాస్త భిన్నంగా వుందనిపిస్తోంది.'

'ఏమిటి?'

'ఇందులో హీరో ఒక పెయింటర్. పెయింటింగ్‌లో వున్న ఆసక్తి అమ్మాయిలతో స్నేహానికి కబుర్లకి వుండదు. అయితే అతన్ని అభిమానించే అమ్మాయిలకి కొదవ లేదు.

'రూప ఒక్క అభిమాని గానే పరిచయం అవుతుంది. మంచి అందగత్తె. ఆమెను చూశాక ఎలాగైనా ఆమె చిత్రం గీయాలన్న గట్టి కోరిక పుడుతుంది అతడికి. అందుకే ఆమెతో పరిచయం పెంచుకుని, నిజాయితీ తన మనసులో మాట బయట పెడతాడు, అతడి నిజాయితీని ప్రేమగా

పొరపాటు పడిన రూప స్యూడోగ కూడా తన చిత్రాలు వేయడానికి అభ్యంతరం చెప్పదు. ఆమెను ఆ రూపంలో చిత్రించేటప్పుడు కూడా అతడి ధ్యాసంతా తను కలిపే రంగుల మిశ్రమం మీద, తన కుంచె కదలికల మీద వుండటం చూసి, అతడంటే మరింత అభిమానం పెంచుకుంటుంది. కాని పెళ్ళి విషయం వచ్చే సరికి బిత్తరపోతా డా చిత్రకారుడు.

'నేను ని న్నా దృష్టితో చూశానా' అని బాధ పడిపోతాడు

అర్థింపులు—వారింపులు, ఏడ్పులు—బెదిరింపులు అన్నిటికీ అతని సమాధానం ఒకటే—" నిన్నా నేనా దృష్టితో చూడలేను. పెళ్ళి చేసుకున్నా భార్యగా సుఖపెడతాననుకోను' అని

అతడి మనస్తత్వం ఆమెలో మరింత పట్టుదల కలిగిస్తుంది. నిజంగా ఈ మనిషికి ప్రేమ కామంలాంటి వేం కలగవా?

తనకు పరిచయం అయిన మగవాళ్ళందరిలో దాదాపుగా స్వార్థము, వెకిలితనమే కనిపించింది. పైకి పెద్ద మనుషుల్లా చలామణి అవుతూ వెకిలిచూపులతో అవకాశం దొరకగానే తమలోని పశు ప్రవృత్తిని బయట పెట్టిన వాళ్ళే. స్నేహం పేరిట మీద పడేవాళ్ళు, సానుభూతి పేరిట భుజాలు తడిమేవాళ్ళే.

మరి యితడికి అతి సమీపంలో ఒంటిమీద నూలుపోగన్నదికూడా లేకుండా ఏకాంతంలో గడిపిన ఎన్నో సందర్భాలున్నాయి. అయినా చేతల ద్వారా కాని, మాటల ద్వారాకాని కనీసం చూపుల్లో కూడా ఎటువంటి ఆసక్తి చూపకుండా తన పని ముగించుకుని యిక స్నేహంగా విడిపోదాం అని మర్యాదగా అడిగే మనిషిని అతడ్నే చూసింది.

'నీభార్యగా కాకపోయినా ఒక స్నేహితురాలిగా యింకా కొన్ని రోజులు యిక్కడ వుండటంలో నీకేం అభ్యంతరంలేదుగా' మనసులోనే తన ఆలోచనలకు ఒకే రూపం యిస్తూ అడుగుతుంది.

అభ్యంతరం చెప్పాల్సిన అవసరం ఏమీ కనిపించలేదతడికి. ఇన్ని రోజులూ అలాగే వుంటూ వచ్చారు కదా!

అతడు 'సరే' అనిందే తడవుగా తన ఆలోచనలకు కార్యరూపం యివ్వటం మొదలు పెడుతుంది రూప. అతడికి ఎదురు పడకుండానే కావాల్సినవి చూడటము పనివాళ్ళని మాన్పించి బాధ్యతలన్నీ తన మీద వేసుకుని ఒక రకంగా మానసికంగా కూడా అతడు తనమీద ఆధారపడేలా చేయగలుగుతుంది. అంతేకాని అంతకంటే మరో మార్పేం తేలేక పోతుంది. అతని దృష్టిలో ఆమె ఒక మంచి స్నేహితురాలు. మంచి మనసున్న మనిషి. అంతే.

చివరికి అతడికి తెలియకుండా తానుకూడా చిత్రకళ నభ్యసించి అతడు చిత్రించిన తన చిత్రాలన్నింటికీ తగిన రంగుల మిశ్రమంతో దుస్తులు ధరించినట్టు పెయింట్ చేస్తుంది.యిక అక్కడ్నించి వెళ్ళక తప్పదని నిర్ణయించుకున్నాక!

అయితే ఆమెలోని కళను చూసిన అతడిలో ఆమె పట్ల ఆకర్షణా, ఆరాధనా అనుకోకుండానే కలుగుతాయి, ఈ కథాంశం 1960–70 మధ్యలో ఏదో పత్రికలో 'వల' అన్న పేరుతో అనుకుంటా రెండు కథలుగా ప్రచురింపబడింది. సందర్భానికి అనుగుణంగా ఆ కథను యిక్కడ వాడుకోడం జరిగింది).

'ఎవరు రాసింది?' చిన్నగా వినిపించిందా ప్రశ్న.

అడిగింది సరళకాదు. అతడు!

చెప్పాను. అయినా అంతవరకు ఏకధాటిగా సరళకి కథ చెప్పుకుపోతున్నా అతడు కల్పించుకోవడంతో కాస్త సంకోచంగా అనిపించింది.

'మీరు పిల్లలకి చేతులూపుతుంటే అంతా చిన్నపిల్లల తరహా అనుకున్నాను. ఇంత గంభీరంగా ఆలోచించగలరని మిమ్మల్ని చూస్తే ఎవరూ అనుకోరు'.

సరళ నేను మొహా మొహాలు చూసుకున్నాం

ఒకరకంగా కాంప్లిమెంట్ అది. అయితే అవతల మనిషిని పట్టేయటానికి కాకుండా నిజాయితీగా మనసులో ఏర్పడ్డ అభిప్రాయం చెప్పినట్టుంది.

'నిజమండీ చాలా మంది వుంటారు—చాల ఆకతాయి తనంగా అల్లరి చేస్తూ దేన్నీ పట్టించుకోనట్టు వుంటారు. కాని అంతర్గతంగా వాళ్ళంతా గంభీరంగా ఆలోచించే వాళ్ళు. జీవితంలో వారికి ఎదురయే అనుభవాలు, ఎదురు దెబ్బలు అందుకు కారణం కావచ్చు. ఇంకొంత మంది అమాయకంగా దేన్నీ గ్రహించే శక్తి లేని వారుగా కనిపిస్తారు చాలా యాంత్రికంగా రోజులు గడిపేస్తున్నట్టు అనిపిస్తారు గాని జీవితాన్ని తీర్చి దిద్దుకోడానికి నిరంతరం కృషిచేస్తూనే వుంటారు. తమ భవిష్యత్తుకు బాటలు వేసుకుంటూ ముందుకు పురోగమిస్తూ వుంటారు'.

అతడంత గంభీరంగా, కాస్త ఫిలాసఫికల్‌గా మాట్లాడుతుంటే నాకు తెలియకుండానే అడిగాను— మీరేం చేస్తుంటారు? అని

అంత వరకు మా గురించి లొడ లొడ అంతా చెప్పేయడమేగాని అతడేం చేస్తున్నాడో, ఎక్కడికి వెళ్తున్నాడో—నేనైతే పట్టించుకోలేదు.

జవాబు సరళ నుంచి వచ్చింది. 'మెడికల్ కాన్ఫరెన్సుకు వెళ్తున్నట్టు చెప్పారు కదా!'

''ఓ! డాక్టరా మీరు?'

ఔనండీ. అయితే ప్రయాణాల్లో ఎప్పుడూ డాక్టరునని చెప్పుకోను. మందులు వెంటబెట్టుకుని తిరగం కదా ఎప్పుడూ? చెప్పేం లాభం అన్నాడు.

అయితే రాత్రికి డిన్నర్ సప్లయ్ అయిం తర్వాత డాక్టరు బుద్ధి చూపనేచూపాడు.

మీరు మరీ అంత తక్కువ తింటే పాఠాలెలా చెపారు?

'డైటింగా?''

''తనంతేలెండి.'' సరళ అంది

అసలు ఆడవాళ్ళే అంతేననుకుంటా. మా అమ్మ, మాచెల్లి కూడా అంతే. ఇంట్లో బాగానే లొంచేస్తారు.

బయట తినాల్సి వస్తే మాత్రం సిగ్గుపడిపోతూ తినాల్నా వద్దా అన్నట్టు మొక్కుబడిగా తింటారు.'

'అసలు మీరు మనుషుల సైకాలజీ మీదేం స్టడీ చేయటం లేదు కదా!'

అందరం నవ్వేశాం.

సరదాగా కబుర్లతో గడిచిపోవటంతో ప్రయాణం అసౌకర్యంగా అనిపించలేదు. గమ్యానికి చేరుకున్నాం. సామాన్లన్నీ సర్దేసి రైలు ఆగగానే దిగటానికి సిద్ధంగా కూర్చున్నాం. ఎవరు ఎన్ని రోజులు ఢిల్లీలో వుండేది. తిరిగి ఎప్పుడు వూర్లకి చేరుకునేది, ఎవరం ఎక్కడ ఉండేది— వివరాలన్నీ అడిగి తెలుసుకున్నాం.

అంతే, రైలు ఆగి ఆగగానే రిసీవ్ చేసు కోడానికి వచ్చిన ఫ్రెండ్స్ పలకరింపులు, సామాన్లు దింపుకోడాలతో ఎవరెటు విడిపోతున్నామో పట్టించుకోలేదు.

ఆటోలో వెళ్తుండగా అతడు ఎక్కిన ఆటో మా పక్కనించే పోతోంది.

'అరె! అతనే: టాటా చెప్పు' ఒడినిండా సామాన్లు పట్టుకుని కూర్చున్న సరళ తనకు వీలుగాక నన్ను తొందర పెట్టేసింది

బుద్ధిమంతురాల్లా చెయ్యూపాను నేను- అతడు నవ్వుతూ చూస్తూండిపోయాడేగాని తిరిగి చెయ్యి మాత్రం వూపలేదు.

'ఎప్పుడైనా తిరిగి కల్సుకోవడం జరిగితే మాట్లాడుతారా మీరు!' మా యిద్దర్నీ చూస్తూ అత డడిగిన మాట గుర్తొచ్చింది.

ఇద్దరం ఆశ్చర్యపోయాం. ఎందుకుమాట్లాడం అని

'ఏమో! పెళ్ళయాక అమ్మాయిలు అంతకు ముందు తామెరిగిన అబ్బాయిల్ని పలకరించరు సాధారణంగా.'

సరళ నేను యిద్దరం వాదించాం ఆ కాలం మారిపోయిందని.

మొదట తనే మాట కలిపి పరిచయం పంచుకున్న మనిషి యిప్పుడు మా ప్రతి మాటకు నవ్వేసి వూరుకోవడం అందులో అప్పుడప్పుడు కాస్త మెచ్చుకోలు కనిపించినా ఎక్కువగా 'ఆడ పిల్లలేదో మాట్లాడుతుంటున్నారులే' అన్న ధోరణి వుంది.

చివరికి విడిపోతూ చెయ్యూపుతున్నా నవ్వే నా సమాధానం

మొత్తం రెండు రోజుల ప్రయాణంలో మేం చర్చించుకున్న విషయాలు, అతడు వెలిబుచ్చిన అభిప్రాయాలూ చాలా రోజుల వరకు గుర్తుకు వచ్చేది. ఫలానా అని చెప్పలేని ఆకర్షణ ఏదో అతడి వ్యక్తిత్వంలో వుంది. అందుకనే అంత త్వరగా మర్చిపోలేక పోయాం అనుకుంటా. ముఖ్యంగా మనుషుల మనస్తత్వాన్ని అంచనా వేయటంలో ఎక్కడా పొరపాటు జరగదు. చాల రోజుల వరకు ఆ ప్రయాణం మర్చిపోలేని అనుభూతిగా మిగిలిపోయింది.

అసలు సాయంకాలం పూట ప్రయాణం చేస్తూ పసుపు పచ్చటి వరిమళ్ళకు చుట్టూ కనకాంబ రాల బంతిపూల నారుతో కంచెను కట్టినట్టు క్షితిజ రేఖలో పరుచుకునే సింధూర రాగాలను చూస్తూ కూచోడం ఒక గొప్ప అనుభూతి.

చిన్న చిన్న వూళ్లచుట్టు పంట పొలాలను దాటుకుంటూ రైలు ముందుకు పరుగిడుతుంటే. వూళ్ల పై మనసు వదలటం యిష్టం లేనట్లు మనచుట్టు పరిభ్రమిస్తున్నట్లు భ్రమలో పడిపోతాం.

అదే అన్నాను సరళతో—ఒక అందమైన అనుభూతిని పంచుకోడంలో ఆనందం వుంది కాబట్టి. 'అది సర్లే, ముందు ప్రొఫెసర్ యిచ్చిన లెటరు ఎక్కడ పరిభ్రమిస్తోందో చెప్పు. బేగ్‌లో పెట్టమన్నాను. పెట్టేవా?" హేండ్ బేగ్‌లో అరలన్నీ తీసి చూస్తూ అడిగింది సరళ.

గుండె ఆగిపోయినంత పనయింది నాకు. లైబ్రరీ పని వున్నన్నిరోజులు మాకు హాస్టల్ అకామిడేషన్ ఏర్పాటు చేయవల్సిందిగా యిచ్చిన లెటర్ టేబుల మీద వదిలి వచ్చేశాను.

సరళకి అర్థం అయిపోయింది. బేగ్‌లో పెట్టడం మర్చిపోయానని.

'ఏం పిల్లవే తల్లీ! అవసరం అయిన ఒక్క పనీ చెయ్యవు. హాస్టల్‌లో వసతి దొరక్క... ఇక్కడ కూడా వూర్లో లేకుండా పోతే ఏంచేద్దాం....'యింకా ఏదో అంటూనే వుంది. నా చెవుల్లోకి ఏం ఎక్కడం లేదు. నిజమే... ఏం చెయ్యాలి!

'వర్లేదులెండి. రిటైరింగ్ రూమ్స్‌లో లేడీస్‌కి ప్రిఫరెన్సు వుంటుంది. ముందక్కడ వుండి నిదానంగా హాస్పటల్లో ప్రయత్నించవచ్చు!'

సమస్యకు ఒక పరిష్కారం చూపుతూ అన్నాడు, ఆక్షణం నాకు దేవుడే అనిపించాడు.

'ఈవిడ చేసే పన్లన్నీ అంతేనండీ! అదో అలా పుస్తకాలు పట్టుకునే కూచో మంటే మాత్రం నవ్వు కలబోసిన కోపం అభినయిస్తూ చూపుతో నన్ను చీరేస్తూ అంది సరళ

చెంపల మీదికి జారుతున్న ఒత్తైన జుట్టు పాయలతో మొహం చాటు చేసుకున్నాను నేను. అది చూసి యిద్దరూ నవ్వారు.

'అలా అనకండి. అది ఏ కొందరు అదృష్టవంతులకో సాధ్యపడే విషయం ఆ పుస్తకాలతో ఆనందం పొందేవారికి మిగతా లోకంతో పనుండదు. వాళ్ళకి బయటి లోకపు కల్మషాలు పోరాటాలతో ఏ మాత్రం సంబంధం వుండదు. నిశ్చింతగా బ్రతికేయగలరు.' నాకు సపోర్టుయిస్తూ అన్నాడతను

'సరి! మీరిలా కితాబులు కూడా యిచ్చారంటే యిక ఆవిడ అదుగో అక్కడెక్కి కూచుంటానంటుంది.'

'లేదండి మీ ఫ్రెండ్ సింప్లిసిటీలోనే అంతా వుందనలు."

'ఇదొకటా యింకా! ఔనూ, అసలేంటి మీరు ఆవిడని సపోర్టు చేస్తున్నారు, గాని యింతగా చింత పడుతున్న నాకు ఒక్క మంచి మాట చెప్పరు!' వాదంలోకి దిగింది సరళ. నవ్వాడతడు.

'మీరు తెరిచిన పుస్తకం. మిమ్మల్ని అర్థం చేసుకోడానికి శ్రమపడనక్కర్లేదు. మీ ఫ్రెండులా కాదు. తన నర్థంచేసుకోవాలంటే ఓపికగా ఒక్కో పేజీ చదవాలి.'

'బస్. బస్. ములగ చెట్టెక్కించేస్తున్నారు మమ్మల్ని' ఆ విషయానికి ఫుల్‌స్టాప్ పెట్టాం అన్నాను నేను.

ఇంకోసారి యిలాగే కబుర్లతో అలిసి పోయి, తిన్నదంతా అరిగిపోయి 'చాయ్' అయినా తాగుదామని ఆర్డర్ యిచ్చాం. నాకూ సరళకు బాగా వేడిగా తాగుట అలవాటు. కప్పు పెదాలకు ఆనించుకొని తాగబోతుంటే 'ఆగాగు' అని నా చేతిలో కప్పుని తాటి 'చీర్స్' చెప్పాను. ఊహించలేదోమో సరిగా అప్పుడే చెయి వెనక్కు తీసుకుంటున్న సరళ చేతిలో కప్పుకి కాస్త బలంగానే తగిలి టీ అంతా చీర మీద ఒలికి పోయింది.

ఒక్క క్షణం అందరూ నిశ్శబ్దంగా అయి పోయాం. ఆ తర్వాత నవ్వులతో మారు మోగి పోయింది వాతావరణం.

'నీ చీర్లు పాడుగాను, చూడు నా చీరంతా పాడయిపోయింది.

అలా అన్నా గొప్పగా ఫీలయిపోతూ తాగుదామనుకుని వుంటారు,' యూనివర్సిటీ రాజకీయ నాయకుడు అన్నాడు నవ్వుతూ.

'చూస్తుంటే మీ స్టూడెంట్ల కంటే మీరే ఎక్కువ అల్లరి చేసేలాగున్నారు. మీ మాట వింటారా వాళ్ళు? లేదంటే వాళ్ళమాట మీరు వింటారా!'

'నిజమే ఎవరి దగ్గర ఎలా వుండాలి అని తెలిసి మసులుకోవడం నిజంగా గొప్ప ఆర్ట్!'

అతడిలో నాకు నచ్చిన విషయం కూడా అదే. తను అనుకున్నది స్పష్టంగా చెప్పెయ్యడం— ఆ పైన తన అంచనాలు ఎప్పుడూ తప్పుకావు అన్నంత ధీమాగా చెప్పడం. నాకు యిటువంటి కాంప్లిమెంట్స్ మామూలే వయసు మళ్ళిన వ్యక్తులు కూడా పిల్ల ఇంత అని చదువుకున్నా అహంకారం లేదని మర్యాద మన్నన తెలిసిన దాన్నని సమ వయస్కుల మంచి కూడా లభించాయి.

ఎటువంటి వేళాకోళతనం లేకుండా అలా అని తెచ్చి పెట్టుకున్న డిగ్నిటీతో ఆకర్షించాలని ఏ మాత్రం ప్రయత్నించకుండా చాలా మామూలుగా యిద్దరు మంచి స్నేహితులు ఎలా మాట్లాడుకుంటారో అలానే తన లిమిట్స్ దాటకుండా మాట్లాడం వల్లనే. అతడ్ని అంత త్వరగా మర్చిపోలేక పోవడానికి కారణం.

ఒక మనిషి పట్ల అభిమానం కలగడానికి ముఖ్యకారణం అతడి అందం హోదా, డబ్బు, వ్యక్తిత్వం—యిదేవీ కావు చివరికి మనపట్ల వారి కున్న ఆదరభావం కూడా కాదు. మనల్ని, మన నిజస్వరూపాన్ని అర్థం చేసుకుని, ప్లస్ పాయింట్స్ కాదు, మన లోటుపాట్లని కూడా స్వీకరించగల గడం: ఆత్మీయతలు పంచుకోవాలంటే అంతర్గత స్వరూపాన్ని అవగాహన చేసుకోగల సామర్థ్యం వుండటం ముఖ్యం. అందుకేనేమో ఇతను నాకింత దగ్గరగా, ఆత్మీయుడుగా అనిపిస్తాడు.

ఆ తర్వాత పెళ్ళయి గుంటూరులో స్థిరపడిన రెండు మూడేళ్ళకు అనుకుంటా మా బాబుకి జ్వరం వచ్చి డాక్టర్ దగ్గరకి వెళ్తే, అక్కడతనే: వున్నాడు గుర్తుపట్టడం కొంచెం కష్టమే అయింది. బాగా గుండ్రంగా తయారయాడు. ముందుగా తనే గుర్తుపట్టి పలకరించాడు.

అతడి భార్య కూడా డాక్టరే. ఇద్దరు పిల్లలు చదువుకుంటున్నారు. ఇక దాదాపుగా గుంటూరులో స్థిరపడినట్టే—ఇవి అతడు చెప్పిన వివరాలు... మాట మాటకి చివర అదే చిరునవ్వు.

అప్పటి నుంచి అతనే మా ఫామిలీ డాక్టరు

నాకు తెలియని విషయం—సదరు డాక్టరు గారికి సాహిత్యంలో నుంచి అభిరుచి వుండటం. లైబ్రరీకి వస్తూ పోతూ తరుచుగా కనిపించేవాడు. మా యిల్లు ఆ పక్కనే వుండటంతో పత్రికల గురించి పుస్తకాల గురించి చర్చించుకునే అవకాశం దొరికేవి దాను రాను అధిదాలా యిష్టమైన పనలో ఒకటి అయిపోయింది.

నాకు నిజంగా ఆశ్చర్యం కలిగించే విషయం యింత వరకు ఎప్పుడూ నా స్నేహితులతో గాని— నా భర్తతో కూడా చర్చించని ఎన్నో విషయాలు ఎంతో ఫ్రీగా అతడితో చర్చించగలగటం. నాకు తెలియని ఎన్నో విషయాలు తెలుసుకునేలా వుండేది మా ప్రతి సంభాషణా స్వతహాగా స్నేహశీలి అవటం వల్ల మా వారికి కూడా మంచి మిత్రుడై పోయాడు. మధ్యతరగతి మనిషి మొహాన కుంద హాసం నిలిపేది యిటువంటి స్నేహాలు ఆత్మీయతలే. మా కుండే ఆర్థిక యిబ్బందులు—బంధు మిత్రులతో తరచుగా వచ్చే చికాకులు—పిల్లల చదువులు—అన్నీ తనకు తెలుసు. తనకెన్ని సమస్యలు—పరిమితులు వున్నా లెక్క చేయకుండా మా ప్రతి సమస్యలోనూ ఆత్మబంధువులా వెంటుండి తగిన సలహాలు యిస్తూ సహాయపడుతూ వుండే ఈ వ్యక్తి అసలు మాకేమౌతాడు ?।

తల్లాతండ్రా! అన్నా—తమ్ముడా?। కట్టుకున్న భర్తకూడా నా మనసు గ్రహించక కోపం తెచ్చుకున్న ఎన్నో సందర్భాలలో మా యిద్దరి మనసులు మధ్య అడ్డుగోడలేం లేనట్టు నా పక్షం నుంచి ఆయనకి సర్ది చెప్పిన సంఘటనలు ఎన్నో:

మాకు ఏమీ కాకుండానే ఈ వ్యక్తి మా జీవన సర్వస్వం అవుతాడని అనుకున్నా నాఅరోజు,

బహుశ నేను సరైన మనిషికే చేయి వూపి వుంటా నా రోజు: అందే జీవనగమనంలో యిప్పుడు సహ ప్రయాణీకుల్లా మిగిలాం...ఎప్పుడు ఎవరం ఎక్కడ విడిపోతామో తెలియకుండానే ప్రయాణం సాగిస్తున్నాం.

రీడర్ పి.జి, కాంప్లెక్స్,
ద. భా. హిందీ ప్రచార సభ
ఖైరతాబాద్,
హైదరాబాద్—4

# పుస్తక సమీక్ష

కొట్రా మల్లికార్జునశర్మ

## శ్రీ భ్రమరాంబా మల్లికార్జున వచనాలు

శ్రీశైల శిఖరం దృష్ట్వా
పునర్జన్మ నవిద్యతే

శ్రీశైలంపై వెలసిన భ్రమరాంబా మల్లికార్జునులు ఆదిదంపతులు. జగత్పితరులైన పార్వతీ పరమేశ్వరులు, ఈ పవిత్ర భారత భూమిపై వారణాసి మొదలైన అనేక పుణ్యక్షేత్రాలలో అనేక పేర్లతో వెలసిన భక్త జనావళి పూజలందుకొంటున్న గౌరీశంకరుల స్తుతి ఇహపర జన్మతారకం. ఏలేశ్వరంలో నెలకొన్న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునులపై శ్రీ కొట్ర మల్లికార్జున శర్మగారు రచించిన 'శ్రీభ్రమరాంబా మల్లికార్జున వచనాలు' ఇటీవల వెలువడిన ఓ భక్తి కావ్యం. ఆంధ్ర సాహిత్యంలో' వచనాలు, ప్రక్రియ బహుళప్రచారం పొందలేదు. సింహగిరి వచనాలు, వెంకటేశ్వర వచనాలు, ప్రసిద్ధమైనవి. తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు ఈ ప్రక్రియలో భక్తిభావ బంధురంగా రచించి సుసంపన్నం చేశారు. తమ ఇలవేల్పులైన శ్రీభ్రమరాంబా మల్లికార్జునులపై కొట్రావారు శ్రుతిరమ్యంగా, మాధురీ ధురీణంగా, హృద్యంగా నూటా పదకొండు వచనాలు రచించారు. భక్తైని రసంగా భావించి' మోక్షసాధన సామగ్ర్యామ్, భక్తిరేవ విశిష్యతే అని, భక్తి యొక్క ఉత్కృష్టతను చాటినారు బుధులు. ఆ భక్తి మార్గంలో మల్లికార్జున శర్మగారు ఈ వచనాలను రచించారు శివ పురాణం మొదలు కాళహస్తీశ్వర శతకం దాకా గల శివ గాథల్ని. మహిమల్ని, స్థల మహాత్మ్యాన్ని, సంఘటనల్ని, సన్నివేశాల్ని సందర్భోచితంగా తమ వచనాలలో పేర్కొనడం ఉచితంగా ఉంది. తమిళ, కన్నడ, హిందీ, మరాఠీ, సాహిత్యాలలో ప్రస్తావించబడిన అనేక మంది భక్తుల వృత్తాంతాలను వివరించడం వల్ల వారి పరిచయమే లేని ఆంధ్ర పాఠకులకు ఈ వచనాలు, విజ్ఞానదాయకాలు కూడా. మహాకవి పోతన 'పలికించెడు వాడు రామభద్రుండటనే పలికిన భవహరమగునట' అన్నట్లుగా ఈ రచయిత, ఇది కేవలం మా ఇలవేల్పు ఇష్టదైవం శ్రీ భ్రమరాంబా మల్లికార్జున స్వామివారి కృపవల్ల సాధ్యమైనదేకాని మరొకటికాదు అన్నారు, 'ఓ మహేశ్వరా! నేనే విద్యలన్ దీక్ష వహించలేదు. ఏ శాస్త్రములనెరుగ. ఏ గురువుల కడ మంత్ర తత్త్వవేదాంతశాస్త్రముల నభ్యసించలేదు. అయినా ఇనుమును సూదంటురాయి ఆకర్షించినట్లు నా హృదయము నీచింతమున పరవశించి పట్టుదప్పి పరవశ్యు (ద్రొక్కి ఈ అల్లిబిల్లి వచనముల నల్లినవి.

---

(శ్రీ భ్రమరాంబా మల్లికార్జున వచనాలు
రచయిత : కొట్రా మల్లికార్జున శర్మ
వెల 15 రూ ప్రతులకు; కొట్రానరసింహమూర్తి
65/సి, సంజీవరెడ్డి నగర్
సి. టైపు కాలనీ హైదరాబాదు-500038.

---

అని సత్త్వికంగా స్వామికి నివేదించుకున్నారు రచయిత (వచనం).

శ్రీ భ్రమరాంబికా! శ్రీ పురాధీశ్వరా! శ్రీశైల మహేశ్వరా అలనాడు అర్జునుని మలనాడు మరాఠాధీశ్వరుని, శ్రీశైలేశ్వరుని కూడా కాని శ్రీ పర్వతమున అధివసించితివి.

ఆ స్వామి పేర నుత్పవించిన మల్లికార్జునుడ వే గదా! అట్టి నీపుత్రుని చెట్టపట్టి, చేరదీసి బిడ్డడు కరుణ నాపై చిలుకుట అచ్చెరువగునే. శతనికే పదివేల నుతులు (వచనం–11) శ్రీశర్మగారు చక్కని కవి. భావ చిత్రాలు, కవితా సంకలనం ఆయన హృదయాన్ని పట్టి చూపిస్తుంది. ఈ వచనాలలో ఎడనెడ కవిత్వం జాల్వారుతుంది.

'హే గౌరీ నాథా! హంసము పద్మవనముల కాంక్షించినట్లు, జాతకములు నీలాంబుదముల నాకాంక్షించు తెరంగున, మయూరములు వన సీమల విహరించ ఉద్యమించు విధమున, ప్రతి దినము చకోరము చంద్రునికై నిరీక్షించు విధాన నా హృదయము నీ ఆగమనార్థమై సదా నిరీక్షించును (వచనం–68)

ఇలా పేర్కొనవలసి వస్తే అన్నిటిని ఉదాహరించవలసిందే. శర్మగారి భాష సులలితంగా మధుర మధురంగా అందరికీ అర్థమయ్యేరీతిలో సాగింది. తాళ్ళపాక పెదతిరుమలాచార్యుల శ్రీ వెంకటవచనాలు. విద్యార్థి దశనుండే బాగా చదివిన కారణంగా కావచ్చు వాటినడక: కొన్ని వచనాలలో స్పష్టంగా కన్పిస్తుంది.

ఈ శ్రీ భ్రమరాంబా మల్లికార్జున వచనాలకు తోడుగా రచయిత పితృపాదులు. స్వర్గీయ కొత్రా నర్సింహశాస్త్రిగారు శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల స్తుతిస్తూ రచించిన పద్యాలు. ఇందులో ప్రచురించారు రచయిత బ్రహ్మశ్రీ కల్లూరి వెంకట సుబ్రహ్మణ్య దీక్షితులు ఈ కృతిని ప్రశంసించారు. తిరుమల తిరుపతి దేవస్థానం ఆర్థిక సహకారంతో ఈ గ్రంథం ముద్రింపబడింది. సాహిత్యాభిమానులు భక్తులు ఆధ్యాత్మిక చింతనాసక్తులు తప్పక చదవ వలసిన కృతి.

తిరునగరి

# వార్తావాహిని

## వరంగల్ జిల్లా అమృతోత్సవ హిందీ మహాసభలు

**జిల్లా హిందీ అమృతోత్సవ మహాసభలు—జనగామ.**

**హిందీ ప్రచారకుల సదస్సు...**

తేది : **19-2-95** ఆదివారం ఉదయం **10-00** గం లకు దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు ప్రధాన కార్యదర్శి శ్రీ అన్నదానం రామస్వామిగారి అధ్యక్షతన జిల్లా హిందీ ప్రచారకుల సదస్సు స్థానిక ఆంధ్ర భాషాభివృద్ధినీ డిగ్రీ కళాశాలలో జరిగినది. తెలంగాణా హిందీ ఆర్గనైజర్ శ్రీ కడారు మల్లయ్య గారు ముఖ్య అతిథులను వేదిక పైకి ఆహ్వానించిరి. జిల్లా హిందీ ప్రచారక మండలి కార్యదర్శి సయ్యద్ హుస్సేన్ గారు స్వాగతోపన్యాసము చేసిరి.

ప్రచారక సదస్సునందు ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారక మండలి అధ్యక్షులు శ్రీ రాజ వెంకటేశ్వరరావుగారు, శ్రీ చందా కాంతయ్య స్మారక స్నాతకోత్సవ కళాశాల హిందీ శాఖాధ్యక్షులు డా॥పి విశ్వనాథంగారు. ఆంధ్రసభ కార్యదర్శి శ్రీ అన్నదానం శంకరశాస్త్రిగారు, ఆంధ్రసభ కోశాధ్యక్షులు శ్రీ చవాకుల నరసింహ మూర్తిగారు ఆంధ్రసభ కార్యవర్గసభ్యులు శ్రీ సి. హెచ్. కుసుమ హరనాథశర్మ శ్రీ గోదా తిరుమలయ్య శ్రీ పి. మహేశ్వరరావు ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారక మండలి ప్రధాన కార్యదర్శి శ్రీ. బి. అంజయ్యగారలు, ఆంధ్రరాష్ట్ర సర్వోదయ మండలి అధ్యక్షులు శ్రీబోయినపల్లి వెంకటరామారావుగారు, కేంద్రసభ మద్రాసు సాహిత్యకార్యదర్శి కుమారి ఎస్. టి. వసంతగారు, ఆంధ్రసభ ఉపాధ్యక్షురాలు శ్రీమతి ఎమ్. వేదవల్లిగారు సదస్సులో పాల్గొనిరి. జనగామ హిందీ విద్యాలయ ప్రిన్సిపాల్ శ్రీ అబ్దుల్ రహమాన్ ఇస్లామియా డిగ్రీ కళాశాల వరంగల్ ఉపన్యాసకులు శ్రీషేక్ హుస్సేన్‌గారు, హిందీ పండితులు శ్రీ అబ్దుల్ ఘని గారలు చర్చలలో పాల్గొనిరి.

ప్రేమీమండలి సహాయక కార్యదర్శి శ్రీ కె. బాలయ్యగారు వందన సమర్పణ గావించిరి

**అమృతోత్సవ మహాసభ:—**

మధ్యాహ్నం **3-00** గం॥ జిల్లా హింది అమృతోత్సవ మహాసభ ప్రేమీమండలి అధ్యక్షులు శ్రీ చందా యాదగిరిగారి అధ్యక్షతన స్థానిక ఎ.బి.వి. డిగ్రీ కళాశాలలో జరిగినది. కేంద్రసభ మద్రాసు ప్రధాన కార్యదర్శి శ్రీ అ. రామస్వామిగారు జ్యోతిని వెలిగించి మహాసభలను ప్రారంభించిరి. జిల్లా ప్రచారక మండలి అధ్యక్షులు

శ్రీ కడారు మల్లయ్యగారు స్వాగతోపన్యాసం చేసిరి. స్థానిక శాసనసభ్యులు శ్రీ సి హెచ్. రాజారెడ్డిగారు అమృతోత్సవ సందర్భముగా ప్రచురించిన ప్రత్యేక సంచిక 'హిందీ అమృతదర్శిని'ని ఆవిష్కరించిరి.

ఆంధ్ర సభ అధ్యక్షులు శ్రీ బోయపాటి నాగేశ్వరరావు గారు తమ ప్రారంభోపన్యాసములో జనగామ హిందీ ప్రేమీ మండలి చేయుచున్న హిందీ ప్రచార కృషిని ప్రశంసించిరి. ఆంధ్ర సభ నిధిపాలక మండలి అధ్యక్షులు శ్రీ వేమూరి ఆంజనేయ శర్మగారు తమ ఉపన్యాసములో జనగామ ప్రేమీ మండలి పూర్వపు వైభవాన్ని జ్ఞాపకం చేస్తూ తెలంగాణాలో జనగామ హిందీ ప్రేమీ మండలి విశిష్టతను తెలిపిరి. ఇంకనూ ఈ సభలో ఆంధ్ర రాష్ట్ర ఆర్య వైశ్య సంఘ అధ్యక్షులు మరియు హిందీ ప్రచారసభ మండలి కార్యవర్గ సభ్యులు శ్రీ డి. వి. రమణయ్యగారు రాష్ట్ర సర్వోదయ మండలి అధ్యక్షులు శ్రీ. బి. వి. రామారావు గారు స్థానిక ఎ.బి.వి. డిగ్రీ కాలేజి ప్రిన్సిపాల్ శ్రీ కాశం అంజయ్యగారు, 'అగ్రగామి' పత్రిక సంపాదకులు శ్రీ కన్నా పరశురాములు జనగామ సహాయ పోలీస్ సూపరింటెండెంట్ శ్రీ హసన్ రజాగారు, జనగామ మండల రెవెన్యూ అధికారి శ్రీ గోవిందుగారు, ఆంధ్ర సభ ట్రస్ట్ బోర్డ్ సభ్యులు డా॥ డి. నారాయణరెడ్డిగారు ప్రసంగించిరి. అతిధులను, హిందీ ప్రచారకులను, మెమెంటోలతో సత్కరించిరి.

ముఖ్య అతిధులకు, మండలి అధ్యక్షులు శ్రీ చందా యాదగిరిగారు శాలువాలు మరియు మెమెంటోలతో ఘనంగా సత్కరించిరి. అమృతోత్సవ పరీక్షలతో 400మంది విద్యార్థులను కూర్చుండ

(మిగతా 64 వ పేజీలో)

## ఆంధ్రప్రదేశ్ హిందీప్రచారకమండలి

ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారకమండలి పరిషత్తు వార్షిక సమావేశము ది 25-1-1995 న మధ్యాహ్నము రెండు గంటలకు ఏలూరులోని అర్బన్ బ్యాంక్ భవనమందు జరిగినది. ప్రచారక మండలి. అధ్యక్షులు శ్రీ కాజ వేంకటేశ్వరరావు గారు సభకు అధ్యక్షత వహించిరి. ప్రార్థనతో సభ ప్రారంభమైనది. అధ్యక్షులవారు తన ప్రారంభ ఉపన్యాసములో హిందీప్రచారక మండలి కార్యకలాపములను వివరించిరి పశ్చిమగోదావరి జిల్లా హిందీ ప్రచారకమండలి రాష్ట్రములో ఆదర్శమైన సంస్థగా హిందీ ప్రచార కార్యక్రమాలను నిర్వహిస్తున్నదని ప్రచారకుల సమస్యలను పరిష్కరించడంలో అగ్రగామిగ వున్నదనిరి. జిల్లా మండలి అధ్యక్షులు వెల్లా పాండురంగారావు గారు అతిథులకు స్వాగతం పలికిరి.

ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారకమండలి ప్రధానకార్యదర్శి శ్రీ బి. అంజయ్యగారు కార్యదర్శి నివేదిక సమర్పించిరి. సమావేశము 1994 సంవత్సరపు ఆదాయవ్యయములను, 1995 బడ్జెటును ఆమోదించినది. అనంతరము ప్రచారక మండలి ఉపాధ్యక్షులు, దక్షిణ భారత హిందీప్రచార సభ– ఆంధ్రశాఖ కార్యవర్గసభ్యులు, శిక్షా పరిషత్ సభ్యులునైన శ్రీ కడారు మల్లయ్యగారి సన్మాన కార్యక్రమము ప్రారంభమైనది. వివిధ హిందీ ప్రచారక మండలి ప్రతినిధులు పూలమాలతో శ్రీ కడారు మల్లయ్యగారిని సత్కరించిరి. అట్టివారిలో పశ్చిమ గోదావరి జిల్లా మండలి అధ్యక్షులు శ్రీ వెల్లా పాండురంగారావు గారు. గుంటూరు జిల్లా మండలి అధ్యక్షులు డా. కె. హనుమంతరావుగారు. గుంటూరు జిల్లా మండలి కార్యదర్శి శిక్షా పరిషత్ సభ్యులు శ్రీ సి. హెచ్. కుసుమహరనాథశర్మగారు. కృష్ణా

జిల్లా మండలి అధ్యక్షులు శ్రీ యన్ ముక్తేశ్వర రావుగారు, వరంగల్ జిల్లా మండలి కార్యదర్శి శ్రీ సయ్యద్ హుసేన్‌గారు, శ్రీ సి. హెచ్. శేషగిరిరావుగారు. శ్రీ చెరుకూరు వెంకటేశ్వర్లు గారు మొదలైన వారున్నారు హిందీ ప్రచారక మండలి అధ్యక్షులు శ్రీ కాజ వెంకటేశ్వరరావుగారు మల్లయ్యగార్ని నూతన వస్త్రములతో సత్కరించిరి. ముఖ్యఅతిథి శ్రీ అల్లూరు నరసింహరాజుగారు స్థానిక జిల్లామండలి తరపున శాలువాతో సత్కరించిరి. గాంధీజీ చిత్రపటమును బహూకరించిరి. శ్రీ నరసింహరాజుగారు, శ్రీ సయ్యద్ హుస్సేన్ గారు శ్రీ పాండురంగారావు, డా. హనుమంతరావు గారు, శ్రీ యన్ ముక్తేశ్వరరావుగారు మొదలైన వారు శ్రీమల్లయ్యగారి విశిష్టవ్యక్తిత్వమును, వారి సేవలను కొనియాడిరి. శ్రీ కుసుమ హరనాథశర్మ గారు మల్లయ్యగార్ని గూర్చి పంచకుసుమాలు చదివి వినిపించిరి. ప్రధాన కార్యదర్శి శ్రీ టి. అంజయ్యగారు మల్లయ్యగారి వ్యక్తిత్వ విశేషాలను వారి అమూల్యమైన సేవలను తెలిపిరి. ముఖ్యఅతిథి శ్రీ నరసింహారావుగారు శ్రీ మల్లయ్యగార్ని గూర్చి ఉపన్యసించుచు ఇంతటి పండితుని గౌరవించడం మన అదృష్టమని కొనియాడిరి. శ్రీ మల్లయ్యగారు తనకు జరిగిన సన్మానమునకు కృతజ్ఞతలు తెలిపిరి

ప్రచారకులు తమ సమస్యలను వివరించిరి. స్వ శ్రీ జె దొరస్వామిరెడ్డిగారు, స్వ శ్రీ. పరిమి సుబ్బారావుగారు, స్వ. శ్రీ. పంచకర్ల వేంకటేశ్వర రావుగార్ల మరణముపట్ల సంతాపము తెలిపి సమావేశము మౌనము పాటించినది. వందనసమర్పణతో సమావేశము ముగిసినది.

## స్వర్గీయ మోటూరి సంస్మరణ సభ

మద్రాసులో ఇటీవల శాశ్వతంగా కన్నుమూసిన 'పద్మభూషణ' డా॥ మోటూరి సత్యనారాయణ సంస్మరణార్థం, 12.3.95 సాయంత్రం గం 4.00లకు తెనాలి హిందీ ప్రేమీమండలి మహా విద్యాలయంలో, గుంటూరు జిల్లా హిందీ ప్రచారక్ మండలి సమావేశం జరిగింది. జిల్లా నలుమూలలనుంచి హిందీ పండితులు పాల్గొన్నారు.

దక్షిణ భారత హిందీ ప్రచార సభ–ఆంధ్ర శాఖ అధ్యక్షులు శ్రీ బోయపాటి నాగేశ్వరరావు అధ్యక్షత వహించారు. అధ్యక్షులు డా॥ మోటూరి వారితో గల తమ సాన్నిహిత్యాన్ని వివిధ స్మృతు లను వివరించారు. ప్రముఖ హిందీ పండితులు సర్వశ్రీ సిహెచ్, కుసుమహరనాథశర్మ, యమ్, సుబ్బరామయ్య, చెరుకూరి వెంకటేశ్వర్లు, సిహెచ్. హనుమంతరావు, చుక్కా కోటి వీరబసవయ్య ప్రభృతులు స్వర్గీయ మోటూరి బహుముఖ సేవ లను కొనియాడి నివాళు లర్పించారు.

ఈ దిగువ తీర్మానం గావించబడింది.

హిందీ ఉద్యమ పితామహులు, హిందీ ప్రచార రథ సారథి దక్షిణ భారత హిందీ ప్రచారసభ, మద్రాసు. హిందీ ప్రధాన కార్యదర్శి రాజ్యసభ మాజీసభ్యులు, మహామేధావి, బహుముఖ ప్రజ్ఞాశాలి. హిందీ తెలుగు భాషలతో సుప్రసిద్ధ రచయిత, ''తెలుగు విజ్ఞాన సర్వస్వం సంపాదకులు, వివిధ రంగాలలో 93 వసంతాలు ప్రజాసేవచేసిరి. వయోవృద్ధులు, పద్మభూషణ్ డా॥ మోటూరి సత్యనారాయణగారి మరణానికి ఈ సమావేశం వారు తమ ప్రగాఢ సంతాపం వెలిబుచ్చుతూ, వారి ఆత్మకు శాంతి చేకూరాలని భగవంతుని ప్రార్థించు చున్నారు.

## గుంతకల్లు హిందీ ప్రచారక ప్రశిక్షణ మహా విద్యాలయము— సమాపన ఉత్సవము

తేది 21-1-1995 మరియు 22-1-1995న హిందీ ప్రచారక ప్రశిక్షణ మహావిద్యాలయ ప్రాంగణమున హిందీ ప్రచారక ప్రశిక్షణ మహావిద్యాలయము సమాపనోత్సవము జరుపబడింది.

తేది 21-1-1995 సాయంత్రము 4 గంటలకు ప్రచారక విద్యార్థుల ఉత్సవము జరిగినది. ప్రచారక విద్యాలయము ప్రధానాచార్యులు శ్రీ. కె వి. సుబ్బారావుగారు అధ్యక్షత వహించిరి శ్రీ కె. గంగిరెడ్డిగారు ట్యూటరు శ్రీ పి కరీంఖాన్ గారు సమావేశములో పాల్గొనిరి.

తేది22-1-1995 ఉదయం 9గంటలకు సమారోహ కార్యక్రమము ప్రారంభమయ్యెను. ప్రధానాచార్యులు శ్రీ. కె వి సుబ్బారావుగారు అధ్యక్షాసనమును స్వీకరించిరి. తమ పదవీకాలమును విరమించిన శ్రీ యం. సుంకప్ప మరియు మునిసిపల్ బాలికోన్నత పాఠశాల ప్రధానాధ్యాపిక శ్రీమతి టి వి. హేమలత గార్లు ముఖ్య అతిథులుగా పాల్గొనిరి. దక్షిణ భారత హిందీ ప్రచారసభ గుంతకల్లు కార్యాలయము మేనేజరు శ్రీ వి. కమలాకర్‌గారు కూడ సమావేశములో పాల్గొనిరి.

ముఖ్యఅతిథులు తమ ఉపన్యాసములో ప్రచారక ప్రశిక్షణ మహా విద్యాలయముయొక్క క్రమశిక్షణ విద్యాలయము ప్రగతిని శ్లాఘించిరి.

సాంస్కృతిక కార్యక్రమముల అనంతరం సభ సమాప్తమైనది.

## ప్రమాణ పత్ర వితరణోత్సవము చీపురుపల్లి

46వ గణతంత్ర దినోత్సవం సందర్భముగా చీపురుపల్లి బాలుర ఉన్నత పాఠశాలలో శ్రీ రాచకొండ కృష్ణారావు గారు, ప్రధానోపాధ్యాయుల అధ్యక్షతన సమావేశమయి దక్షిణ భారత హిందీ ప్రచారసభ, మద్రాసు వారి ప్రమాణ పత్రములు ప్రాథమిక నుండి ప్రవీణ వరకు గల విద్యార్థినీ విద్యార్థులకు అందచేయుట జరిగినది. ఈ సందర్భమున హిందీ ఆవశ్యకతను అధ్యక్షుల వారు నొక్కివక్కాణించిరి. స్థానిక హిందీ ప్రచారకులు శ్రీ బెహరా కైలాసరావు పట్నాయక్ గారి వందన సమర్పణతో సభ ముగిసింది.

## సహాయక్ ప్రచారకులకు విజ్ఞప్తి

1995 సెప్టెంబరు సెషన్‌కు ద. భా. హిందీ ప్ర సభ వారి ప్రాథమిక, మధ్యమ మరియు రాష్ట్రభాష కలిపి 60 మంది పైన విద్యార్థులను పరీక్షలకు తయారు చేయుచున్నవారు సహాయక్ ప్రచారక్ ప్రార్థనా పత్రములను తేది 15–5–95లోగా సభ కార్యాలయమునకు పంపుకొనవలెను. ఆ తర్వాత వచ్చినవి పరిశీలించబడవు.

కార్యదర్శి

## స్వతంత్ర ప్రచారకులకు విజ్ఞప్తి

1995 అగష్టు సెషన్‌కు ద. భా. హిం. ప్ర. సభ వారి ప్రాథమిక, మధ్యమ మరియు రాష్ట్రభాష కలిపి 20 మంది పైన మరియు ప్రవేశిక మొ॥కొని ప్రవీణ వరకు పరీక్షార్థులను పంపుచున్నవారు స్వతంత్ర ప్రచారక్ ఆవేదన పత్రములను మే 15-5-95లోగా సభ కార్యాలయమునకు పంపవలెను. ఆ తర్వాత వచ్చినవి పరిశీలించబడవు.

కార్యదర్శి

# వరంగల్ జిల్లా అమృతోత్సవ హిందీ మహాసభలు

(61 వ పేజీ తరువాయి)

పెట్టిన హిందీ ప్రచారకులను ఆంధ్రసభ అధ్యక్షులు శ్రీ బోయపాటి నాగేశ్వరరావుగారు సన్మానించిరి. వక్తలందరూ జనగామలో జరుగుచున్న హిందీ ప్రచారమును కొనియాడుచూ ప్రసంగించిరి హిందీ ప్రచారసభ పదాధికారులు జనగామలోని తెలంగాణా ప్రాంతీయశాఖ కార్యాలయమును అభివృద్ధి పరచుటకు తను సహాయ సహకారముల నందించ గలమని హామి ఇచ్చిరి. జనగామ శాసన సభ్యులు శ్రీ రాజారెడ్డిగారు హిందీ ప్రచారక ట్రైనింగ్ కాలేజికి ప్రభుత్వ అనుమతి లభించే విధంగా ప్రయత్నం చేయగలనని హామి ఇచ్చిరి.

హిందీ ప్రేమీ మండలి ప్రధాన కార్యదర్శి శ్రీ అబ్దుల్ రహమాన్‌గారు సభకు విచ్చేసిన అతిధులకు కృతజ్ఞతను తెలియజేసిరి. జాతీయ గీతముతో అమృతోత్సవ మహాసభలు విజయవంతముగా ముగిసినవి.



జ్యోతిని వెలిగించి అమృతోత్సవ మహాసభలను ప్రారంభించుచున్న కేంద్ర సభ మద్రాసు ప్రధాన
కార్యదర్శి శ్రీ అన్నదానం రామస్వామి గారు. అమృతోత్సవ మహాసభల సందర్భంగా
ప్రచురింపబడిన హిందీ అమృత దర్శిని ని ఆవిష్కరించుచున్న స్థానిక శాసన
సభ్యులు శ్రీ సి. హెచ్. రాజారెడ్డి గారు. ఆంధ్ర సభ కార్యకారిణీ
సమితి సభ్యులు శ్రీ కె. నారు మల్లయ్య గారు మరియు హిందీ
ప్రేమీ మండలి జనగామ అధ్యక్షులు శ్రీ చంపా యాదగిరి
గార్లను చిత్రంలో చూడవచ్చును.



సాయంత్రం 8 గం॥లకు జరిగిన అమృతోత్సవ మహాసభ నందు ప్రసంగించుచున్న ఆంధ్ర సభ
అధ్యక్షులు శ్రీ బోయపాటి నాగేశ్వరరావు గారు, కేంద్ర సభ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. రామ
స్వామి గారు, స్థానిక ఎ.బి.వి. డిగ్రీ కళాశాల ప్రధానాచార్యులు శ్రీ కె. అంజయ్య
గారు మరియు ఆంధ్ర సభ ట్రస్టు బోర్డు సభ్యులు డి. నారాయణరెడ్డి గారు.

# స్రవంతి

## (యాజమాన్యం తదితర వివరాలు)

[ఫారం 4 (8 వ నిబంధన) ప్రకారము]

1. ప్రచురణ స్థలం : **6–2–959** ఖైరతాబాద్, హైదరాబాద్–**500 004**
2. ప్రచురణ వ్యవధి : మాసం
3. ముద్రాపకుని పేరు : ఎ. శంకరశాస్త్రి
   జాతీయత ; భారతీయత
   చిరునామా : **6–2–959** ఖైరతాబాద్
   హైదరాబాద్–**500 004**
4. పత్రిక యజమానులు : దక్షిణ భారత హిందీ ప్రచార సభ–ఆంధ్ర
   **6–2–959** ఖైరతాబాద్, హైదరాబాద్–**500 004**

పైవివరములు నాకు తెలిసినంత వరకు వాస్తవికమైనవని ఇందుమూలముగా తెలియ చేయుచున్నాను

హైదరాబాద్ ఎ. శంకరశాస్త్రి
తేదీ **28–3–1995** ప్రకాశకులు

Edited Printed andPublished by A. Sankara Sastry on behalf of the D.B.Hindi-Prachar Sabha-Andhra. Khairatabad. Hyderabad-500004.
and Printed at Dakshin Bharat Press, Khairatabad, Hyderabad-500 004.